# ఇందులో—

# ... నేటి చైనా ...

రచన :

పింగళి పరశురామయ్య

సంస్కృతి గ్రంథమండలి

వంగల్ బిల్డింగ్స్ :: పెరంబూరు పోస్టు

మద్రాసు

అంకితము —

ఈ రచనకు ప్రాణం పోసిన
భాషాభిమానులు, నా ప్రియ
మిత్రులగు యువక దంపతులు

శ్రీ పూరాడ వెంకటేశ్వరరావు
సీతారామమ్మ గార్లకు.

# గ్రంథకర్త

జననం 24-5-1919 న మచిలీపట్టణంలో. బాల్యం, విద్యాభ్యాసం, మద్రాసు, నెల్లూరు, కర్నూలులలో. బాల్యంనుంచీ పత్రికా రచనంటే అభిలాష. 1937 నుండి 1941 వరకు అఖిలభారత విద్యార్థి ఉద్యమంలో అత్యుత్సాహంగా పాల్గొన్నాడు. ఈ సందర్భంలోనే ఆంధ్ర కార్మిక కర్షక నాయకులగు ఆచార్య యన్. జి. రంగాగారితోను, బొంబాయి సోషలిస్టు నాయకులగు శ్రీ యస్. యస్. బాట్లివాలాగారితోను పరిచయం. ఈ కాలంలోనే పత్రికారచన విరివిగా చేయడం, భూగర్భ శాస్త్రాన్ని అభ్యసించడం జరిగింది. గ్రంథకర్త తండ్రిగారగు శ్రీ పింగళి వెంకయ్యగారు గొప్ప భూగర్భ శాస్త్రజ్ఞులవడమువల్లనే అతనికి ఈ శాస్త్రమంటే అంత అభిమానము పుట్టింది. 1941 లో ఆంధ్ర వారపత్రికకు 'ఆంధ్రదేశంలోని ఖనిజ సంపద' అనే శీర్షికక్రింద అనేకవ్యాసాలు వ్రాశాడు. ఈ సంవత్సరంలోనే "ప్రజాబంధు"కు సహాయ సంపాదకుడుగా నున్నాడు. 1942 మార్చిలో పత్రికలన్నీ చైనా ప్రత్యేక సంచికలను ప్రకటించినప్పుడు "ఆంధ్రప్రభ"కు చైనా జాతీయోద్యమజనకుడగు డాక్టరు సన్ యట్ సెన్ జీవితసంగ్రహాన్ని వ్రాశాడు. ఈవ్యాసమే ప్రకాశకుల నాకర్షించింది. ప్రకాశకుల ప్రోత్సాహమే గ్రంథకర్తను ఈరచనకు సిద్ధపరచింది. 1942 లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో సరిక్రొత్తగ స్థాపించిన భూగర్భ శాస్త్రశాఖలో అధ్యాపకుడుగ కొంతకాలం పనిజేశాడు. నవంబరు, 1942 నుండి ఆంధ్రదేశంలో పారిశ్రామికోద్ధారకులును, వితరణగుణులును నగు శ్రీ చుండూరు వెంకటరెడ్డిగారికి ఖనిజశాస్త్రజ్ఞుడుగా పనిచేయుచున్నాడు. ఇటీవల ఖనిజపరిశ్రమల మీద, అంతర్జాతీయఖ్యాతిగాంచిన "మాడరన్ రెవ్యూ" మాసపత్రికలో కొన్నివ్యాసములు వ్రాశాడు. యింకా వ్రాస్తున్నాడు. మాటపడే రకంకాదు. సంఘసంస్కరణాభిలాషి.

# . . . . . మా మాట . . . . .

మా గ్రంథమండలి ప్రచురణలు ఇకముందు సాఫీగా తరచు వెలువడునని మా ఆశ. ప్రభుత్వంవారు ఇటీవల అమలునందుంచిన నూతన చట్టప్రకారం కాగితం మాకు — ప్రచురణకర్తలమగుటచే — దొరకగలదని నమ్మిక.

శ్రీ పింగళి పరశురామయ్యగారు ఇప్పటికి షుమారు సంవత్సరం క్రితమే 'నేటి పైనా'ను రచించియుంచారు. కాగితం దొరకనందున మేము ఇంతదనుక ముద్రింపలేకపోయాం. మా గ్రంథ మండలికి రచన నిచ్చిన మిత్రులు శ్రీ పింగళి పరశురామయ్యగారికిని, వ్రాతప్రతిని సరిచూచియిచ్చిన శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రిగారికిని, మాకవసరమైన బ్లాకుల నెరవిచ్చిన శ్రీ జనశక్తి కార్యాలయంవారికిని కృతజ్ఞులం. ఆంధ్రులు మా ప్రయత్నాలకు తగిన ప్రోత్సాహమిత్తురని నమ్మిక.

పెరంబూరు
1-1-1944

సంపాదకుడు.

# ........తొలిపలుకు........

పత్రికారచనన్నా, గ్రంథరచనన్నా నేటి యువతీయువకులు పొంగి పోతున్నారు. వ్రాశే వ్రాతలల్లో ఒక్క మెరుపైనా లేకపోయినా అచ్చులో తమ పేరుచూచి ఆనందిద్దామనే వారూ వున్నారు. పత్రికారచనకు, గ్రంథ కర్తృత్వానికీ ఉండే ప్రతిభ, దర్జా మనం యింకా బాగా అర్థం చేసికోలేదు. మన ఆంధ్రరచనల్లో మరీ కుళ్ళుంది. దైనిక పత్రికల్లోకూడా గ్రాంథిక భాషా పదజాలాన్ని గుప్పతూ సామాన్య ప్రజలకది అగమ్యంగా చేస్తున్నారు. దీనితో పత్రిక పరమాశయమే భగ్నమవుతోంది. ఇక ఆంగ్ల, ఆంధ్ర భాషలనుచేర్చి సమానంగా వాడుతూ వ్రాసే రచనలకు ప్రాధాన్యతనిచ్చే కుక్క గొడుగుల్లాంటి పత్రికలనేకములున్నాయి. కాని, నిరక్షరాస్యత హెచ్చుగా ఉన్న మన దేశంలోవాడుక భాషా ప్రాముఖ్యతను గురించి వేరుగా చెప్ప నక్కరలేదు. సామాన్యమానవులకు అర్థం కావాలంటే వాడుక భాషలోనే గ్రంథరచన జరపాలి. వాడుక భాషేగదా అని అసలు భాషనే ఖూనీచేస్తూ పరభాషా పదాలను కొల్లలుగా వాడడం తప్పు.

అందరికీ నచ్చేటట్లు ఆంధ్రభాషలో గ్రంథం వ్రాయడం అసిధారావ్రత చర్యవంటిది. సాంస్కృతిక విజ్ఞానం సామాన్య ప్రజలో వెదజల్లడమేనా యీ గ్రంథరచన యొక్క ముఖ్యోద్దేశ్యం. భాషకన్నా భావమే నాకు ప్రధానం. భావాన్ని సామాన్య ప్రజ కర్థమయ్యేందుకు ఉపకరించే భాష లోను, శైలిలోను వ్రాశాను. ఇందుకు భాషావేత్తలు ఆగ్రహపడరాదు. నేటి సంఘంలో సర్వతోముఖ విప్లవాలు జరుగుతున్నాయి. అందుకు దోహద మయ్యే రచనలు కావాలి. నా ఆశయంకూడా అదే. "ఆంధ్రప్రభ" మార్చి 1942 లో వేసిన చైనా ప్రత్యేక సంచికలో నేను వ్రాసిన డాక్టరుసన్ యాట్ సెన్ జీవిత సంగ్రహం, ప్రజలకు తేజకరంగా ఉంటుందనే వ్రాశాను. అదే ఈ గ్రంథ ప్రకాశకులును, నా ప్రియమిత్రులును నగు శ్రీ కొత్తపల్లి సుబ్బరామయ్యగారు నా కర్పించింది. వారి ప్రోత్సాహమే నన్నీరచనకు పురి కొల్పింది. ప్రచురణవిషయమై వారు నాకిచ్చిన వాగ్దానమే నన్నెంతో ఉత్సాహపరచింది. వ్రాసే ప్రతిభ ఉన్నా అచ్చు వేయించే నాథుడులేక ఎన్నో రచనలు మురిగిపోతున్నాయి. నాకిట్టి చేయూతనిచ్చి గ్రంథరచన చేయించిన శ్రీ సుబ్బరామయ్యగారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

ఉద్యోగంకోసం నేను 1941 లో మద్రాస్ వచ్చినప్పుడు దైవ ప్రేరితంగా సన్నికర్షించి, నాకెంతో సహాయంచేస్తూ, నా అంతరంగిక మిత్రులగు శ్రీ కూరాడ, వెంకటేశ్వరరావు, సీతారామమ్మగార్లు నాకీ గ్రంథరచనలో ఎంతో తోడ్పడ్డారు. నాకుండే యితర వ్యాపకాలవల్ల, శ్రీ సుబ్బరామయ్యగారు అప్పుడప్పుడు జ్ఞాపకంచేస్తున్నా, ఈ గ్రంథమును శ్రీ కూరాడ దంపతుల సహాయమే లేకుంటే యింత త్వరలో చదువరుల కందియడానికి వీలు పడేదికాదు. వీరిద్దరూ భాషాభిమానులవడంవల్లనూ, నేనంటే ఎంతో వాత్సల్యముండడంవల్లనూ ఈ గ్రంథరచనలో మొదటినుండి తుదవరకు నాకు అమూల్య సహాయంచేశారు. సాఫువ్రాత ప్రతి వ్రాయడంలో శ్రీమతి సీతారామమ్మగారు చాల శ్రద్ధవహించారు. ఈ దంపతులకు నా హృదయపూర్వక అభివందనాలు.

బెజవాడ
22-12-43

పింగళి పరశురామయ్య

## ఈ రచనకు ఆధార గ్రంథాలు


1. ENCYCLOPEDIA BRITANNICA *(14th Edition)*
2. CHINA HAND BOOK, 1943, PUBLISHED *By THE CHINESE MINISTRY OF INFORMATION*
3. LIFE OF Dr. SUNYATSEN *By Sri P. VENKAYYA*
4. UPLIFT OF CHINA *By Mr. SMITH*
5. Dr. SUNYATSEN AND THE AWAKENING OF CHINA *By Dr. JAMES CANTLEY & H. C. JONES*
6. GREAT BRITAIN & CHINA *By SIR JOHN PRATT*
7. WAR TORN CHINA *By Srimathi KAMALADEVI CHATOPADHYAYA*
8. CHINA STRUGGLES FOR UNITY *By Mr. J. M. D. PRINGLE*
9. INSIDE ASIA *By JOHN GUNTHER*



డాక్టర్ సన్‌యట్‌సెన్

# 1. స్వాతంత్ర్యచైనా చరిత్ర సంగ్రహం

ఆధునిక ప్రపంచంలోని ప్రజా ప్రభుత్వాలలోకెల్ల పెద్దదియగు చైనా ప్రజా ప్రభుత్వం మన దేశపు సరిహద్దులలోనే వుంది. చైనాదేశసులు మన కిరుగు పొరుగువారు. ప్రాచీన సంస్కృతిలో నేమి, జీవితా దర్శాలలో నేమి, చైనా-భారతదేశాలకు చాలా పోలిక లున్నాయి. నైతిక జీవనంలోనూ, రాజకీయాలలోనూ చైనా-భారతదేశాలకు చారిత్రకంగా చాల సన్నిహిత సంబంధా లున్నాయి. వారూ, మనమూ కూడ "ఆసియాఖండ వాసులం". నవ్యయుగపు తాకిడివల్ల ఆసియాఖండవాసుల ప్రాచ్య సంస్కృతిలో కొన్ని మార్పులు కలిగినా, ఈ ఖండపు వివిధదేశ ప్రజల నిత్యజీవనంలో, నికరంగా నిలిచిన ఆచార వ్యవహారాలు, జీవితా దర్శాలు, సంస్కృతి—అన్నీ ఒకే మాదిరిగా ఉంటాయి. ఈ కారణాలవల్ల మనప్రక్కనే ప్రజ్వరిల్లుతూన్న స్వాతంత్ర్య చైనా ప్రజా హృదయాన్ని పూర్తిగా అర్థం చేసుకుని, చైనా-భారతదేశాల మధ్య అంతర్జాతీయ సౌహార్ద్రాన్ని పెంపొందింపజేయడం భారతీయుల విధి. ఈ రచనయొక్క ఉద్దేశ్యమే యిది.

చైనాజాతి మిక్కిలి ప్రాచీనమైనది. వాసయోగ్యమగు ప్రపంచ వైశాల్యంలో నాల్గవవంతుందీ చైనా ప్రజాప్రభుత్వం. ఐరోపాదేశానికన్న ఎంతో పెద్దది. చైనాలోని 28 రాష్ట్రాలు, మంగోలియా, టిబెట్, మంచూరియాలు కలిసి చైనా ప్రజాప్రభుత్వ మవుతుంది. దీని వైశాల్యం 44,80,992 చదరపుమైళ్లు. జనసంఖ్య 45,00,00,000. మంగోలియా, టిబెట్, మంచూరియాలు మినహాయిస్తే చైనాదేశపు నికర విస్తీర్ణం 29,03,475 చదరపుమైళ్ళు మాత్రమేను. అందలి జనాభా 40,00,00.000 అని అంచనా వేశారు. మంచూరియా, జోహోల్ రాష్ట్రాలను కలిపి 1933లో జపాను "మంచూకో" అనే ఒక మిథ్య స్వాతంత్ర్యరాష్ట్రాన్ని స్థాపించి. తన చెప్పు చేతలలో ఉంచుకుంటోంది. మంగోలియా, టిబెట్ లు న్యాయ

సమస్తంగా చైనాకు చెందినవైనా వాటిమీద చైనాకున్న యధార్థపు ఆధికారం సున్న. కాబట్టి, చైనా ప్రజాప్రభుత్వమంటే చైనాలోని 28 రాష్ట్రాలే ననడం సమంజసం.

చైనాదేశానికి మంచి ఉనికిపట్టు ఉంది. అత్యంతోన్నత్యమైన చైనా పర్వతాలలోనుండి జీవనదులెన్నో పుట్టి చైనాదేశాన్ని సారవంతం చేస్తున్నాయి. చైనాకున్నంత నీటివసతి ప్రపంచంలో మరే దేశానికి లేదు. అదే అక్షాంశములోనున్న తదితర దేశాలకన్నా చైనాదేశం సమశీతోష్ణంగా ఉంటుంది. దక్షిణ చైనాలో తుపానుగాలులు, ఋతుపవనాలు వీచడంవల్ల యితర ఉష్ణోగ్రతగల దక్షిణదేశాలలో ఉండే ప్రజలవలె దక్షిణచైనా దేశస్థులు బలహీనులు, మందకొడులుగాక ఉత్తరాన చలిప్రదేశాలలో పెరిగే వారివలె బలాఢ్యులై చురుకుగా ఉంటారు. మొత్తంమీద చైనా శీతోష్ణస్థితి సుభిక్షజీవనానికి తగినదిగా ఉంటుంది. ఉత్తరచైనా సమతల సారవంతపు భూమిలోను, దక్షిణ కోస్తా రాష్ట్రాలలోను, హోయాంగ్‌హో, యాంగ్‌ట్సికియాంగ్, సికియాంగ్ నదుల లోయలలోను, జనసమర్ధన మెక్కువగా ఉంది. ఉత్తర, దక్షిణ చైనాలకు ఎంతో తారతమ్యము ఉంది. ఉత్తర చైనాలో వర్షపాతం నమ్మకంలేదు, అతి శీతలం, ఇసుక తుపానులతో ఎడారి ప్రదేశాలు, నదులు పొంగి, పంటలు పాడయి, కాటకం రావడం, వ్యాపారానికి పనికిరాని నగులు, సముద్రాని కెంతో దూరం, సముద్రయానం తెలియదు. కాని దక్షిణ చైనాలో కావలసినంత వర్షపాతం, పచ్చటిచేలు, జీవనదులు, సుభిక్ష జీవనం. సమతల సారవంతప్రదేశం తక్కువవడంవల్ల చైనా ప్రజంతా ఇరుకైన సారవంతపు లోయలలో క్రిక్కిరిసి కాలం గడపాలి. పట్టణాలలో వీధులు ఎంతో సంకుచితంగా ఉంటాయి. దక్షిణ చైనాకోస్తా ప్రాంతాల్లో మంచి ఓడరేవు లున్నాయి. ప్రజలు మంచి నావికులు.

భారతదేశంలోవలెనే చైనాలోకూడ వ్యవసాయమే ముఖ్య జీవనోపాడి. నూటికి 80 మంది కర్షవృత్తి. 'హాంగ్‌హై'కు ప్రాంతాల్లో ఉండే

సుక్షేత్రమైన భూమిల్లో ఎకరానికి ఎనమండుగురు బ్రతకవచ్చు. పట్టుపురుగు పుట్టిందే చైనాలో. పట్టుపరిశ్రమకోసం మల్బరీచెట్లు ఆపారంగా పెంచుతారు. పింగాణీ పరిశ్రమ, దంతపు చెక్కడం, లక్కపనులు విరివిగా ఉన్నాయి చైనాలో. తేయాకు పరిశ్రమకూడ ముఖ్యమే. చైనాలో ప్రతి రాష్ట్రంలోనూ బొగ్గుగనులున్నాయి. బ్రిటను, ఐరోపా దేశాలలోని బొగ్గు గనులకు 20 రెట్లు చైనాలో ఉన్నాయి. ప్రపంచ వ్యాపారంలో పెద్ద విప్లవం తీసుకురాగల ఖనిజసంపద చైనాకుంది. మంచి ఇనుము, ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన రాగి, అపారంగా త్రవ్వుతున్నారు చైనాలో. చైనా కంచుకు సాటైన కంచు ఎక్కడా దొరకదు. ప్రపంచానికంతకూ 2,000 సంవత్సరాల పాటు సరిపోయే ఇనుము, బొగ్గు చైనాలో ఉన్నాయని "బేరన్ వాన్ రిచ్ హోవెన్" అనే జర్మన్ శాస్త్రజ్ఞు డెన్నడో వ్రాశాడు. కాబట్టి చైనా గొప్ప పారిశ్రామిక దేశం కావడానికి మంచి అవకాశా లున్నాయి.

మన దేశంలోవలెనే చైనాలోనూ నిరక్షకుకులెంతమందో యున్నారు. చైనా ప్రజలో నూటికి 20 మంది మాత్రం అక్షరాస్యులని అంచనా వేశారు. చదువురాని వారిలో సగానికి సగంమంది వయోజనులు. ప్రాచ్యదేశాలలో యీ వయోజనవిద్యకుండే ప్రాముఖ్యత విస్మరింపరానిది. 1940-వ సంవత్సరం ఏప్రిల్ నెలలో వయోజన విద్యా వ్యాప్తికోసం, చైనా విద్యావిషయిక మంత్రివర్గంవారు, పంచవర్ష ప్రణాళిక నొకదానిని తయారు చేశారు. నిరక్షరాస్యత నిర్మూలించడానికి చైనా ప్రజాప్రభుత్వం ఎంతో శ్రద్ధ చూపుతోంది.

ప్రాచీన చైనాదేశంలో పలు భిన్నమతా లుండడం సహజం. బౌద్ధ మతం, టోయిజం, కన్ ఫ్యూషియన్ మతం, క్రైస్తవమతం, మహమ్మదీయ మతం—అనే వివిధ మతా లున్నాయి. చైనా దేశస్థులలో చాలమంది బౌద్ధ మతస్థులు. నూటికి 12 మంది మహమ్మదీయులు. క్రైస్తవులు చాల కొద్ది మంది. భాగ్యవంతు లందరూ కన్ ఫ్యూషియనులు. "టోయిజం" అనేది వేదాంత విషయిక మతం. ఇన్ని భిన్నమతాలున్నా చైనాలో మత వైష

మ్యాలకు తావు లేదు. మత స్వాతంత్ర్యమునకు చైనా ప్రభుత్వం పాటు పడు తుంది. చైనాలోని వివిధమత సూత్రాలను గురించి ఉద్గ్రంథాలు వెలువడి నాయి. వాటి ప్రాచీనత జగద్విదితము. మన దేశంలోవలె మామతం గొప్ప దంటే మామతం గొప్పదని వాగ్వివాదాలు పెంచుకోడం చైనా ప్రజాజీవనంలో లేదు. మతమొక శాసనం కాదు. సక్రమ సాంఘిక జీవనానికి దారి చూపుతూ మోక్షము నిచ్చేందుకు మతం కావాలంటారు చైనా దేశస్థులు.

కృషిక జీవనం చైనా సంస్కృతికి పునాది. కృషిక వృత్తి కర్తవ్య పరమయిన నీతి సముపార్జనకోసం సాముదాయికత చైనా ప్రజాజీవనంలో నాటుకుపోయింది. చైనా సాంఘిక జీవనంలో కుటుంబాని కెంతో ప్రాముఖ్యతా, గౌరవమూను. సక్రమ కుటుంబజీవనమే, గ్రామపంచాయతీలకు దారి తీసింది. పెద్ద, పిన్న తారతమ్యతలో, నైతిక జీవనానికుండే ఉత్కృష్టత నెరిగి సంఘాన్ని నడుపుతున్నారు. కాబట్టే చైనావంటివిశాలదేశంలోని ప్రజా బాహుళ్యాన్ని ఒక్క స్వాతంత్ర్యజెండాక్రిందకి తీసుకురావడానికివీలయింది.

1911-లో డాక్టరు సన్ యట్ సెన్ అధ్వర్యాన నడపబడిన చైనావిప్లవం జయప్రదమయి, ప్రజాప్రభుత్వం స్థాపించకముందు కొన్ని రాజ కుటుంబాలు వంశ పారంపర్యంగా చైనాను పరిపాలిస్తూండేవి. ఈ రాజకుటుంబాల నిరంకుశ ప్రభుత్వమంటే ప్రజలకు ఏవగింపుపుట్టి విప్లవ జ్వాలలు చెలరేగినాయి. 1911-లో ప్రారంభింపబడిన విప్లవం ఎన్నో గండాలు గడిచి 1927 నాటికి "కుమింటాంగ్" అనే రాజకీయ ప్రజాపక్ష యాజమాన్యం క్రింద, ప్రజా ప్రభుత్వస్థాపన చేయడానికి వీలయింది. ఈ పక్షానికుండే ప్రబలమైన పలుకుబడివల్ల 1927 మొదలు 1937 వరకు చైనాప్రభుత్వ నిర్వాహణమంతా దాని ముఖతానే జరిగింది. "కుమింటాంగ్" అనే రాజకీయపక్షమే కాక, కమ్యూనిష్టులు, ప్రజా స్వామ్యవాదులు, జాతీయవాదులు, మానవపక్షము అనే ఇతర రాజకీయపక్షాలుకూడా చైనాలోఉన్నాయి. 1937లో జపానుతో యుద్ధానికి దిగాలిసి వచ్చినప్పుడు చైనాలోని చిల్లర రాజకీయపక్షాల ఐక్యత ముఖ్యమని చైనా దేశీయ నాయకులు గ్రహించి ఆ పక్షాలకుకూడ ప్రజాప్రభుత్వ నిర్వ

హాణంలో స్థానమిచ్చారు. 1936-వ సంవత్సరం డిశెంబరు నెల నాటికి చైనాలోని వివిధ రాజకీయపక్షాలకు సామరస్యం కుదిరింది. "జపాను ఒక మూల దురాక్రమణ సాగిస్తూంటే స్వదేశంలో అంతఃకలహాలు పెట్టుకోకుండా అన్ని పక్షాలు ఏకోన్ముఖంగా పోరాడుతూ శత్రువు నెదిరించడమే ప్రతి పౌరుని పరమాశయం"గా ఉండాలని 1937, మే 15వ తేదిన చైనా కమ్యూనిస్టు పక్షం చేసిన ప్రకటనవల్ల, యుద్ధసమయంలో దేశైక్యతకుండే ప్రాముఖ్యతను చైనావారెంత సూక్ష్మబుద్ధితో ఆచరణలో పెట్టారో విశదమవుతుంది.

జపాను, చైనాలోని సారవంతమైన రాష్ట్రాలను కొన్నిటిని ఆక్రమించడంచేత, ప్రపంచ యుద్ధంవల్ల చైనాకరెన్సీ పద్ధతులు తారుమారవడంచేత, అంతర్జాతీయ మారకపు పద్ధతులు క్షణికంగా మారడంవల్ల, చైనా ఆర్థిక జీవనం మిక్కిలి క్లిష్టతరమయింది. చైనాలోని ముఖ్య రేవుస్థలాలను, ఉప్పు కొఠారులను, పారిశ్రామిక ప్రాంతాలను జపాను ఆక్రమించడంవల్ల చైనాకు ముఖ్య రాబడి నిచ్చే ఎగుమతి-దిగుమతి పన్నులు, ఉప్పు గుత్త వ్యాపారపు రాబడి, తదితర చిల్లర పన్నులు జపాను హస్తగత మయినాయి. 1938 నాటికే చైనా ప్రభుత్వానికి వచ్చే రాబడి, దానికయ్యే ఖర్చులో సగము మాత్రమేను. చైనా-జపాను యుద్ధం భయంకరరూపం దాల్చిన గత నాలుగైదు సంవత్సరాలలో చైనాకు ఖర్చు ఎక్కువయి, ఆదాయపు పన్ను అధికం చేసారు; వారసత్వపు పన్నులు విధించారు, అత్యధిక లాభాలమీద పన్నులు వేశారు. అప్పటికీ చైనా ప్రభుత్వం యితర దేశాలనుండి ఎంతో అప్పు పుచ్చుకోక తప్పడం లేదు. మారకపురేట్లు తారుమారయి అంతర్జాతీయ వ్యాపారం కుంటుపడి, చైనాకరెన్సీ (ద్రవ్యమానం) కొనుగోలు శక్తి తగ్గి, ధరలు పెరిగి, సరుకులు దొరకక మనదేశంలోవలెనే చైనా ఆర్థిక జీవనం కూడా భీభత్సంగా ఉంది.

1937 లో జపానుతో యుద్ధం సాగేసరికి చైనాలో 20,00,000 మంది సిపాయీలు మాత్రం ఉన్నారు. శిక్షణ పొందిన రిజర్వు సిపాయి లెవ్వరూ లేరు. 1937 వరకు కేంద్ర నిర్బంధ శిక్షణ విధానం అమలులోకి రానేలేదు.

1925లో స్థాపింపబడిన జాతీయ సైన్యంయొక్క దినదినాభివృద్ధి ఫలితమే నేటి ఆధునిక చైనా సైనిక దళం. ప్రభుత్వ సైన్యం, గెరిల్లాలు, పౌర సైనికులు— అందరూ కలిసి 1940 నాటికి 25,00,000 మంది మాత్రం ఉన్నారు. "జాతీయ సైనిక శాసన సభ" చైనా సైన్యానికంతకూ అధికారి. చైనాసర్వసేనానియు, చైనా భావిభాగ్యవిధాతయునగు, మార్షల్ చంగ్ కై షెక్ యీ సభకు అధ్యక్షుడు. ఈ సభ ఆధిపత్యం క్రింద రెండున్నరవందల శాఖలుగల 50 సైనిక దళాలు తయారయినాయి. జనరల్ చంగ్ కై షెక్ ఆధిపత్యంలో చైనా సైన్యాలు వివిధ యుద్ధరంగాల్లో మిక్కిలి ధైర్య సాహసాలతో పోరాడుతున్నాయి. చైనా సైన్యాన్ని 'కె' సైన్యము; 'ఎఱ్ఱ' సైన్యము అని రెండు ప్రత్యేక విభాగాలుగా చేయవచ్చును. 'కె' సైన్యంలో కేంద్రసైన్యం, క్వాంగ్సీ, తదితర రాష్ట్రీయ సైన్యాలు చేరుతాయి. ఒక్క చోటనే స్థిరంగా ఉండి శత్రువుతో చాకచక్యంగా పోరాడుతవీ సైన్యాలు. ఒక చోటినుండి యింకో చోటికి యిట్టే పరుగెత్తడానికి వీలుగా ఉండవు. 'ఎఱ్ఱసైన్యం'లో అష్టమమార్గ సైన్యం, నవ్య నాల్గవసైన్యం అనేవి వుంటాయి. ఒకచోటినుండి యింకొకచోటికి యిట్టే పరుగెత్తి శత్రువు నెదుర్కొండంలో యీ సైన్యం ఆరితేరింది.

పాశ్చాత్యులచే 'నల్లమందు భాయీ' లనబడే చైనావారిలో యింత చైతన్యం ఎలా వచ్చింది!! యుద్ధ పరిస్థితులవల్ల ఏర్పడిన అసామాన్య ఆర్థిక, రాజకీయ, సైనిక, సాంఘిక సమస్యలను చైనాజాతి ఎలా ఎదుర్కొంటూంది!! జపాను పైశాచికత నెలా తట్టుకుంటోంది!! అనే విషయాలు చాలామందికి ఆశ్చర్యం కలిగించవచ్చును. నిజమే, అనేకరకాల శీతోష్ణస్థితులతోను, భూసారాలతోను, ఉత్తర, దక్షిణ ప్రాంతాలకుండే తారతమ్యాతతోను, చైనావంటి విశాలఖండంలో ఎన్నోరకాల సంస్కృతులు, ఆర్థిక, సాంఘిక, పరిస్థితులు, భిన్నభిన్న రాజకీయపక్షాలు ఒండొంటితో సతతమూ పోట్లాడుకుంటూంటా యనుకోడం సహజం. కాని, చైనా ప్రాచీన ప్రాచ్య సంస్కృతిలోని ప్రతిభ ఏమోగాని, ఆ విశాలదేశంలో ప్రపంచ జనాభాలో

ఆయిగపవంతున్నా వారికుండే ఐకమత్యం, ఐక్యత ఆశ్చర్యం కలిగిస్తాయి. ఇట్టి ఉత్కృష్ట చైనా నాగరికతకు జోహారు లివ్వాలి. చైనా సంస్కృతి యింత ప్రాచీనము కాబట్టే ఎన్నో యుగాల తాకిడికి తట్టుకుని యీనాటికీ మార్గదర్శిగా ఉంది. పాశ్చాత్య దేశాలలోవలె పోలీసు ప్రభుత్వానికి చైనా సంస్కృతిలో తావులేదు. ప్రభుత్వ శాసనాలు ప్రజల కిష్టమయినా లేక పోయినా అనుసరించాలనే పాశ్చాత్య దండన విధానానికి చైనా ప్రాచీన నాగరికత ఒప్పుకోదు. ప్రబోధంవల్ల, ఉదాహరణంవల్ల ప్రజా హృదయాన్ని రంజించి ప్రభుత్వం చేయాలంటుంది చైనాజాతి. చైనా శాసనాలన్నీ యిందు కనుగుణ్యంగా ఉంటాయి. గ్రామాధికారి మొదలు, చక్రవర్తి వరకు తమ విధులను తాము సక్రమంగా నిర్వహించడమే ప్రభుత్వ నిర్వహణ మంటారు చైనావారు. గ్రామ పంచాయతీలు చైనా ప్రజాజీవనానికి పట్టుగొమ్మలు. ఈ పంచాయతీ పద్ధతి చైనాలో అభివృద్ధి కావడానికి కారణమేమంటే చైనాదేశస్థు లందరూ ప్రాంతీయభేదాలు లేకుండా ఒకే మనః ప్రవృత్తితో మెలగడానికి ప్రయత్నిస్తారు. ఐక్యత, ఐకమత్యం అనే యీ రెండు గొప్ప సాంఘిక సూత్రాలనూ తు. చ. తప్పకుండా చైనాజాతి అనుసరిస్తూంది కాబట్టే యీ నాటికి తన స్వాతంత్ర్య[illegible]ండాను కాపాడుకో గలుగుతోంది. ఈ విషయంలో మనం చైనానుంచి గుణపాఠం నేర్చుకోవాలి.



# 2. స్వాతంత్ర్యోద్యమం

నేటి స్వాతంత్ర చైనాకు "కాంటన్" నగరం పుట్టినిల్లు. చైనా జాతీయోద్యమ జనకుడగు డాక్టరు సన్ యెట్ సెన్ పుట్టింది యీ నగరంలోనే. ఈ నగరంలో ఎన్నో విప్లవాలు పుట్టాయి, ఎన్నో రక్తపాతాలు జరిగాయి. చైనా భాగ్యవిధాతయగు డాక్టరు సన్ యీ నగరాన్నుండి ప్రచారంచేసిన విప్లవ జ్వాలలు చైనావారి హృదయాలలో ప్రజ్వరిల్లుతూనే వున్నాయి. పాశ్చాత్యదేశాల కందుబాటులోవుండి, ఆ దేశాలతో వర్తక వ్యాపారాలు చేయడానికి నీలుగా వుండడంవల్ల కోస్తా పట్టణాలు విదేశ తాకిడికి మొదట్లో గురి అయినాయి.

వెయ్యి సంవత్సరాలకు పూర్వం అరబ్బులు, 1511 లో పోర్చుగీసువారు, 19 వ శతాబ్దపు మొదటి రోజుల్లో అమెరికా, బ్రిటను దేశస్థులు వచ్చారు చైనాకు. తలిమా వారు చైనాలో పీఠంవేసుకు కూర్చోకపోయినా, అమెరికా, బ్రిటను దేశీయులుమాత్రం తేయాకుతోటలను వేసుకుని అత్యధిక లాభాలు గుంజుతున్నారు. ఈ విదేశ తాకిడివల్ల చైనాలో ఆర్థికదోపిడి ఎక్కువయినా, విదేశ విజ్ఞాన సంపర్కంవల్ల చైనా ప్రజలో స్వాతంత్ర్యాపేక్ష హెచ్చిందని చెప్పాలి. విదేశాలకుపోయి ఆధునిక శాస్త్ర పరిజ్ఞానాన్ని మిక్కిలి తెలివితేటలతో, చెమటోడ్చి, మూటగట్టుకుని వచ్చిన చాలమంది చైనా విద్యార్థులు కోస్తానగరాలలో నివాసమేర్పరుచుకుని; తమ విజ్ఞానాన్ని, అజ్ఞానాంధకారంలో మునిగియున్న చైనా ప్రజ హృదయ క్షేత్రాలలో విత్తడంచేతనే "చైనా జాతీయతా పునర్జీవ" మనే పుష్పం వికసించి స్వాతంత్ర్య సువాసనలను వెదజల్లుతోంది. ఇందువల్లనే "క్రొత్త వింత ఏదిపుట్టినా కోస్తా నగరమగు కాంటన్‌లో పుడుతుంది" అని చైనావారంటారు. కాబట్టి మంచూ చక్రవర్తుల దుష్కర పరిపాలనను ధ్వంసంచేసిన చైనా స్వాతంత్ర్యోద్యమం ఈ కాంటన్ నగరంలో పుట్టిందంటే వింతేముంది!!!

చైనాలో అనేక పురాతన దేవాలయాలు, అత్యద్భుత కట్టడాలు ఉన్నప్పటికీ ఆధునిక చైనా నాయకులు డాక్టరు సన్ యట్ సెన్ విశ్వకళా పరిషత్తును, సన్ యట్ సెన్ స్మారక చిహ్న స్థూపాలను, కట్టడాలను ఎంతో భక్తి శ్రద్ధలతో గౌరవిస్తారు. "జాతీయత, ప్రజాస్వామ్యం, సుభిక్ష ప్రజా జీవనం" అనే మూడు గొప్ప సూత్రాల పునాదులమీద 1911 లో చైనా స్వాతంత్ర్య సౌధ నిర్మాణానికి విఘ్నేశ్వర పూజచేసి చాలవరకు తన జీవిత కాలంలోనే ఆ సౌధాన్ని ముగించిన సన్ యట్ సెన్ స్మారకార్థం చైనా ప్రజలు ఎన్నో గొప్ప పనులుచేశారు. యువక చైనాకూ, కుమిన్ టాంగ్ పక్షానికీ యీ మూడు సూత్రాలే వేదవాక్కు లయినాయి.

సన్ యట్ సెన్ నిరంతర కృషివల్ల స్థాపింపబడిన చైనా ప్రజాప్రభుత్వమనెడి పునాదులమీద నవ్యజాతీయ ప్రభుత్వం స్థాపించడానికి ఎన్నో అవకాశాలున్నాయనీ, కాఫీహోటల్లు పెట్టుకుని అమాయికపు ప్రజల డబ్బు గుంజే పొగరుబోతు విదేశీయుల ఆటలిక చైనాలో సాగవనీ, జపాను సైనికాధికారుల ఆర్థిక దోపిడీకి యిట్టే లొంగిపోయే పురాతనపు నిర్జీవ, అపవిత్ర, విచ్ఛిన్న చైనా దేశానికి నేడు తావులేదని, నేటి కోస్తా నగరాలు, అందులో "కాంటన్" నగరం చూచిన ప్రతివారికీ స్ఫురిస్తుంది. కాలశక్తి అగణ్యము. స్వాతంత్ర్య చైనాకొక సుస్థిరత ఏర్పడింది. చైనా స్వాతంత్ర్యంపు టలల కెదురీదడాని కెవ్వరికీ సాధ్యంకాదు.

మంచూ చక్రవర్తుల అక్రమపరిపాలన, అత్యాచారాలే చీనా విప్లవానికి ముఖ్యకారణాలు. చీనాలో మంచూ చక్రవర్తులనాటి పరిపాలనా విధానాన్ని గురించి డాక్టరు సన్ యట్ సెన్ వ్రాసిన సంగతులు చదివితే చీనా దేశంలో విప్లవం జయప్రదంగా కొనసాగడానికి గల కారణాలు విశదమవుతాయి. జాతీయ పరిపాలనలోగాని, స్థానిక పరిపాలనలోగాని ప్రజలకే మాత్రం హక్కులులేవు. నిరంకుశుడగు చక్రవర్తిచే నియోగింపబడిన ప్రభుత్వ నౌకరులు ప్రజలకు మేకులై, అంతులేని అత్యాచారాలుచేస్తూ ప్రజలను పలు విధాల హింసిస్తూ, లంచాలు పుచ్చుకుంటూండేవారు. ఉద్యోగం కావా

లంచే లంచం, ఉద్యోగం నిలబెట్టుకోవాలంటే లంచం, పైఉద్యోగం రావాలంటే లంచం,—యిట్లా లంచగొండితనం హద్దు మీరిపోయిన ఆ కాలంలో నిరంకుశ మంచూ చక్రవర్తుల పరిపాలనంటే ఏవగింపు పుట్టడం సహజం. కాని మంచూ చక్రవర్తులు తమ దౌర్జన్య పరిపాలనవల్ల జనసామాన్యానికి వారి చుట్టుపట్ల ఏమి జరుగుతోందో చెప్పకుండా వీలైనంతవరకు ప్రజలను అధోగతిలో వుంచేవారు.

రాజకీయగ్రంథాలు చదవనిచ్చేవారు కారు అప్పటి ప్రభుత్వోద్యోగులు. వార్తాపత్రికలను నిరోధించేవారు. పరిసర ప్రపంచంతో సంబంధంలేకుండా చేసేవారు. ప్రభుత్వ శాకరులు తప్ప మిగత ప్రజలు చీనాదేశపు లేక తదితర దేశాల భూగోళం చదవకూడదని శాసించేవారు. చీనాలో అప్పట్లో ఆచరణలోనున్న న్యాయశాస్త్రములన్నీ పెద్ద ఉద్యోగస్థులే నేర్చుకోడానికి వీల్లుండేది. మిలిటరీ విషయాలమీద పుస్తకాలు చదవకూడదనేవారు. ఒక వేళ ప్రభుత్వ శాసనాన్ని ధిక్కరించి ఎవరైనా మిలిటరీ విషయాల జోలికి పోతే ఉరిశిక్షకూడా విధించేవారు.

ఇట్టి నిరంకుశ ప్రభుత్వం ప్రజల నశక్తులజేసి అధోగతిలో వుంచినా, చీనాదేశసులు చైతన్య విహీనులు కాలేదు. వారిలోనున్న స్వాతంత్ర్యాపేక్ష రగిలి, రాజీ, విప్లవ రూపంగా పరిణమించింది. చీనా జాతిలోనున్న అంతర్గత శక్తియుక్తులు అపారమని యిరోపియనులే వేనోళ్ల చాటుచున్నారు. ప్రతిభావ్యుత్పత్తులలో చీనాదేశీయులు యిరోపా ఖండవాసులకన్న చాల గొప్పవారు.

విదేశ శృంఖలాలనుండి విడిపోయి చీనా దేశీయులందరూ కలిసి ఒక గొప్ప జాతిగా తయారవ్వాలనీ, అంటే జాతీయత పెంపొందాలనీ, ప్రజలే పరిపాలకులుగా ఉండాలనీ, ప్రజల సుభిక్షజీవనం కోసం వస్తుసముదాయోత్పత్తి, విభజనలలో ప్రజలే పాల్గొనవలెనని యనెడి గొప్ప సూత్రాలను సన్ యట్ సెన్ మనస్సునందు దిడుకొని 1911 లో చైనావిప్లవమును లేవదీసెను. చైనాలో ప్రజా ప్రభుత్వస్థాపనకు యీ మహావీరుడు చేసిన కృషి యింతింతని

చెప్పుటకు వీలులేదు. విప్లవం జయప్రదంగా కొనసాగి ప్రజాప్రభుత్వం స్థాపింపబడ్డదన్న సంతోషం సన్ యట్ సెన్ కు వున్నప్పటికీ ఆయన ఆశయాలు అంతటితో ముగియలేదు. చైనా దేశాన్ని బ్రిటను, అమెరికాలవంటి విదేశములమాదిరిగా పెట్టుబడిదారీ సూత్రాలమీద నడపాలని సన్ కు ఎన్నడూ వుండేది కాదు. అందుకే ఆయన అన్నాడు—

"బ్రిటనులో చట్టసమ్మతమగు రాచరికముంది. ఫ్రాంన్సు (ఇప్పుడు కాదు. ఫ్రాంన్సు పతనానికి పూర్వం) అమెరికాలలో పూర్తి ప్రజాప్రభుత్వాలున్నాయి. అయినప్పటికీ ఆదేశాలలో భాగ్యవంతులు, పేదవారికి ఉండే అంతరాలకు అంతేలేదు. ఇందువల్లనే అంత నవనాగరక దేశాలలో కూడ విప్లవోద్దేశాలు యిప్పటికీ కొంతమందిని పీడిస్తున్నాయి. ఎందువల్లనంటే రాజకీయ మార్పులతోపాటు సాంఘిక మార్పులుకూడ రాకపోతే జనసామాన్యానికి సంపూర్ణసంతోష, సౌఖ్యాలు చేకూరవు. ఏ కొద్దిమంది పెట్టుబడిదారులో అనుభవిస్తారా సంతోషం, సౌఖ్యం. కార్మిక, కర్షకుల కష్టాలు తొలగక పోవడంచేత వారిలో అసంతృప్తి ప్రబలుతుంది. ఒక జాతిలో విప్లవం తీసుకురావడం, ఒక ప్రభుత్వ వైఖరిలో మార్పు తీసుకురావడం చాల సులువైన విషయాలు; కాని సంఘంలో విప్లవం తీసుకురావడం కష్టతమమైన పని. సాంఘిక విప్లవం జయప్రదంగా కొనసాగించాలంటే ప్రజ్ఞావంతులగు ప్రముఖులు సంఘంలో బయలుదేరాలి."

సన్ యట్ సెన్ మూడు దశాబ్దాలకు పూర్వం వ్రాసిన పై సాంఘిక వేదవాక్యాలు ఈనాటికి ప్రతి సంఘ సంస్కర్త మననం చేసుకోకతప్పదు.

చైనాలో ప్రజాప్రభుత్వం స్థాపింపబడి నప్పటికీ వివిధ సైనికోద్యోగుల నిరంకుశత్వం, బహు నాయకత్వంవల్ల, ప్రస్తుత శతాబ్దంలోగూడ చీనాదేశపు రాజకీయాలు అవిచింత్యమగు అసహాయ స్థితిలోనుండి, విదేశీయుల సామ్రాజ్యతత్వానికి, స్వదేశీయుల దుష్పరిపాలనకు గురియవక తప్పిందికాదు చైనా దేశం. ఈ అంతఃకలహాలన్నిటినీ అణచివేసి సుస్థిరమైన కేంద్రప్రజా ప్రభుత్వం స్థాపించడం చంగ్ కై షెక్ వంటి ప్రతిభాశాలికికూడ భగీరథ ప్రయత్నమైంది.

డాక్టరు సన్ వేసిన పునాదులమీద జాతీయసౌధాన్ని సర్వాంగ సుందరంగా నిర్మించడం, శత్రుబారినుండి రక్షించుకునే భారం చైనా భావి భాగ్యవిధాతయగు చంగ్ కై షేక్ మీద పడింది. మార్షల్ చంగ్ కై షేక్ తన సైన్యాలతో ఒక్కొక్క రాజకీయ విభాగమే జయించి చైనా దేశైక్య తను సమకూర్చేందుకు విశ్వప్రయత్నంచేశాడు. తత్ప్రయత్నం ఫలోన్ముఖా నికి వచ్చేసరికి జపాను చైనాపై దండెత్తింది.

జపాను నెదుర్కొనుచు, చైనా జాతీయోద్యమ నాయకుడే ఆధునిక ప్రపంచంలో ఆదర్శపురుషు డయ్యాడు మార్షల్ చంగ్ కై షేక్. ఈయన నాయకత్వంక్రింద చైనాదేశస్థులు నిరుపమ ధైర్యసాహసాలతో జపాను నెదు ర్కొనుచున్నారు. జపాను మారణహోమంలో ఆహుతి అవడానికికూడ వెనుదీయక నానాటికి స్వాతంత్ర్యవాంఛ, ఆత్మగౌరవం, విజయకాంక్ష హెచ్చి ఏకోన్ముఖంగా పోరాడుతున్నారు యీనాటి చైనా ప్రజలు తమ అంతఃకలహాలన్నీ చంపుకుని.

మార్షల్ చంగ్ కై షేక్ దంపతుల నాయకత్వం, చైనా మనోబలం అపార జనసంఖ్య జపానుపట్ల పెను భూతాలయినాయి. నిజంగా చంగ్ కై షేక్ దంపతుల అత్యనుకూల దాంపత్యంలో ఇమిడి ఉందా అనిపిస్తుంది చైనాజాతియొక్క సమరశక్తీ, ప్రతి ఘటనాసామర్థ్యమూను. చైనా స్వాతం త్ర్యోద్యమానికి మార్షల్ చంగ్ కై షేక్ ఒక నూతనావతారం. పురాతన పద్ధ తులు, అసహాయత, అమాయకత్వం, నిరాయుధత—అన్నింటిని మరచి క్రొత్త ఆయుధాలను, యుద్ధపద్ధతులను సమకూర్చుకుంటున్నారు నేటి చైనా ప్రజలు.

చంగ్ కై షేక్ నిరంతర కృషివల్ల 1927 వ సంవత్సరంలో 'నాన్ కింగ్' నగరంలో కేంద్రజాతీయ ప్రభుత్వం స్థాపింపబడింది. 1927 మొదలు 1929 వరకు చంగ్ కై షేక్ తన సైన్యాలతో వివిధ భిన్న రాజకీయ భాగాలను జయించి చైనాదేశైక్యతకు పాటుపడినాడు. చైనా స్వాతంత్ర్యోద్యమ చరి త్రలో దీన్ని సైనికయుగం అనవచ్చు. కొంత ఐక్యత చేకూరిన తరువాత ప్రజ

లలో ప్రబోధం కలిగించే ప్రచారం చేయడమే స్వాతంత్ర్యోద్యమానికి రెండవ మెట్టు. దీన్ని ప్రజా ప్రబోధయుగం అనవచ్చు. 1929 మొదలు చెంగ్ కై షేక్ దంపతులు చేస్తున్న పనేయిది. ప్రజలలో కొంత ప్రబోధం కలిగి చైతన్యం వచ్చిన తరువాత నిజమైన ప్రజాప్రభుత్వం స్థాపించాలి. ప్రజా ప్రభుత్వ స్థాపనకు చైనాలోని భిన్న రాజకీయపక్షాలు చాలా అంతరాయాలు కల్పించాయి కాని చంగ్ కై షేక్ దంపతులు, వివిధ రాజకీయపక్షాలతో సఖ్యము కుదుర్చుకుని; జాతీయత, ప్రజాస్వామ్యం, సుభిక్ష ప్రజాజీవనం అనే డాక్టరుసన్ సూత్రాల ననుసరించి "ప్రజలకోసం, ప్రజలచేత స్థాపింపబడి, ప్రజలవల్ల నడపబడే ప్రభుత్వం" స్థాపించడానికి 1937 లో ప్రయత్నాలు జరుగుతూండగానే, జపాను దురాక్రమణకు అంకురార్పణయింది.

1927 లో 'నాన్ కింగ్' కేంద్రప్రభుత్వం స్థాపింపబడినప్పటికీ, 1937 వరకు చైనాలో సుస్థిరమైన ప్రజాస్వామ్యస్థాపన జరుగకపోవడానికి గల కారణాలేమిటో చూస్తే చైనా స్వాతంత్ర్యోద్యమం యెట్లా పరిణమించిందో తెలుస్తుంది.

చైనాలో 'కుమిన్ టాంగ్' పక్షానికున్న పలుకుబడి మరొకదానికి లేదు. డాక్టరుసన్ ప్రబోధంచేసిన విప్లవజ్వాలలను ప్రజ్వరిల్లజేసే ప్రతివారూ యీ పక్షంలో చేరవచ్చు. ఇందులో 100,000 మంది సభ్యులున్నారు. ప్రతి రెండేండ్లకు ఈ పక్ష మహాజన సభ జరుగుతూంటుంది. కేంద్ర కార్యనిర్వాహక సంఘం కేంద్ర అజమాయిషీ సంఘం అనే రెండు సంఘాలకు 'కుమిన్ టాంగ్' పక్ష మహాజనసభ తన అధికారాలన్నిటినీ యిస్తుంది. ఈ రెండు సంఘాలేగాక, వాటినుండే ఎన్నుకోబడిన కేంద్రరాజకీయ సభ ఒకటి వుంటుంది. ఈ కేంద్రరాజకీయ సభ ప్రభుత్వపు రోజువారీ విషయాలు చూస్తుంది. ఈ 'కుమిన్ టాంగ్' పక్ష సహాయంతో చంగ్ కై షేక్ తన అధికారం చెలాయిస్తున్నాడు.

1927 లో కేంద్రజాతీయ ప్రభుత్వం స్థాపించడమేగాక పారిశ్రామికంగా చైనాను ముందుకు తీసుకురావడానికి చంగ్ కై షేక్ ప్రయత్నించాడు.

చైనా ఆర్థికజీవనం అభివృద్ధి కావడానికి విదేశాలతో ఒడంబడికలుగూడా చేశాడు. జర్మనీ సేనానాయకుల సలహాతో ఒక గొప్ప ఆధునిక సైన్యాన్ని నిర్మించాడు. 1927-1936 సంవత్సరాల మధ్య, సన్ యట్ సెన్ ప్రణాళికను అమలులో పెట్టడానికి ఇంతకన్నా ఎక్కువ చేయలేకపోయాడు మార్షల్ చంగ్ కై షేక్. భూమిశిస్తు విధానంలో ఎన్నో సంస్కరణ లావశ్యకమయినా చంగ్ కై షేక్ చేయలేకపోయాడు. ఇట్టి సంస్కరణలు చైనా ఆర్థికాభివృద్ధికీ ప్రజల సుభిక్షజీవనానికీ చాలా ముఖ్యమైన వగుటచేత, వెంటనే ఆచరణలో పెట్టాలనే కమ్యూనిస్టులకూ, చంగ్ కై షేక్‌కు అభిప్రాయ భేధాలువచ్చి 1926 లో కమ్యూనిస్టులు తమ సోవియట్ చైనా రాష్ట్రాలల్లో సుస్థిరమైన ప్రత్యేక ప్రభుత్వమే నిర్మించుకోగలిగారు. చైనాలోని కమ్యూనిజం ముఖ్యంగా గ్రామీణమైనది. జమీందారులచేతనూ, షాహుకారులచేతనూ, పీల్చిపిప్పిచేయబడే పేదరైతు జనోద్ధరణకు పాటుపడడమే చైనా కమ్యూనిస్టు పక్ష ముఖ్యాశయం. భూమిగానీ, తదితర వస్తూత్పత్తి సాధనాలుగానీ పూర్తిగా ప్రభుత్వం చేతుల్లోనే ఉండాలని చైనా కమ్యూనిస్టు లెన్నడూ అనలేదు. న్యాయసమ్మతమైన భూవిభజన విధానం అమలుపరచాలనే కమ్యూనిస్టుల కోటి పాట. చైనా రైతుల నుద్ధరించుకుంటూ చేయగలిగి, కమ్యూనిస్టులు ప్రత్యేక సోవియట్ చైనాను స్థాపించుకోగలిగి పదిసంవత్సరాలపాటు మార్షల్ చంగ్ కై షేక్ సైన్యాలను ప్రతిఘటించడానికి సాధ్యమయింది.

కమ్యూనిస్టులమీద కాలుదువ్వి, దేశైక్యతకు చాలా అంతరాయం కల్గించాడనాలి మార్షల్ చంగ్ కై షేక్. ఒక్క ఆర్థిక సంస్కరణల విషయంలోనే గాక జపాను నెదుర్కోడానికి మార్షల్ చంగ్ కై షేక్ 1927 మొదలు 1937 వరకు చేసిన తాచివేతను గురించిగూడా కమ్యూనిస్టులలో చాలా మందికి చంగ్ కై షేక్ మీద అనుమానం హెచ్చింది. ఇందువల్ల మార్షల్ చాంగ్-హుష్లియంగ్ అనే యువకుడు చంగ్ కై షేక్‌ను ఖైదీచేసి 'సయాన్' అనే చోట వుంచాడు. హుష్లియంగ్ కమ్యూనిస్టు కాకపోయినా "జపానును ప్రతిఘటించాలి" అనే ఆశయంగల వేరొక యువక పక్షానికి నాయకుడు.

కమ్యూనిస్టులుకూడా ఈ 'సయాన్' [illegible] చేసి నప్పటికీ, మార్షల్ చంగ్ కై షేక్‌కు చైనా ప్రజాహృదయంమీద వుండే పలుకుబడి కమ్యూనిస్టులకు తెలుసు కాబట్టీ, జపాను ఒకమూల దురాక్రమణ సాగిస్తూన్న రోజులలో దేశైక్యత ముఖ్యమైనదని కమ్యూనిస్టులు గ్రహించ బట్టీ, మార్షల్ చంగ్ కైషేక్‌ను కమ్యూనిస్టులే విడిపించారు.

ఈ సయాన్ సంఘటన తరువాత చైనా దేశైక్యత యిట్టే చేకూరింది. 1936 వ సంవత్సరం డిసెంబరు నెల చైనా స్వాతంత్ర్యోద్యమంలో చాలా చారిత్రకమైనది. ఈ నెలలోనే చైనా వివిధరాజకీయపక్షాలకు సామరస్యంకుది రింది. "జపాను ఒకమూలవచ్చి చైనామీద పడుతూంటే స్వదేశంలో అంతః కలహాలు పెట్టుకోకుండా అన్నిపక్షాలు ఏకోన్ముఖంగా శత్రువు నెదిరించ డమే ప్రతి పౌరుని పరమాశయంగా ఉండా" లని, 1937 మే 15 వ తేదీన కమ్యూనిస్టుపక్షం గావించిన ప్రకటనవల్ల కుమిన్‌టాంగ్ పక్షానికి, కమ్యూనిస్టు పక్షానికి ఐక్యతచేకూరింది. ప్రఖ్యాత చైనా రచయితయగు "లిన్‌యుటాంగ్" సూచించినట్లు:—

"విశాలభావ సంపుటియైన చైనా పురాతన సంస్కృతి సహాయంతో, నియంతృత్వానికి, కమ్యూనిజానికి సంధి సమకూర్చే సామ్యవాద ప్రజా ప్రభుత్వం స్థాపించి చైనా ఒక ప్రత్యేకత సంపాదించగలదు. ఈనాడు పాశ్చాత్యదేశాల్లో, నియంతృత్వానికి, ప్రజాస్వామ్యానికి, కమ్యూనిజానికి జరుగుతూన్న గొప్ప పోరాటంలో చైనా ప్రజాస్వామ్యాన్నే స్వీకరిస్తూంది."

# 3. రాజకీయపక్షాలు - కమ్యూనిస్టులు

ఆధునిక చైనా నిర్మాణానికి, సాంఘిక, రాజకీయ, ఆర్థిక విప్లవా లెన్నో జరిగాయి, జరుగుతున్నాయి, జరుగనున్నాయి. నేటి చైనా నిర్మాణానికి ఒక విప్లవం కాదు, అరడజను విప్లవాలు జరిగా యనవచ్చును. ఇంతి బ్రహ్మప్రళయ మెందుకు కావాలా? అని కొందరి కాశ్చర్యం కలగవచ్చు. అవును, మరి అయిదువేల సంవత్సరాల ప్రాచీనతగల చైనా ప్రాచ్యసంస్కృతికి పాశ్చాత్య తాకిడీ గలిగేటప్పటికి చైనాలో ఎంతో అలజడి పుట్టక తప్పిందికాదు. వ్యవసాయ పద్ధతులలో, రాజకీయాలలో, సాంఘిక, నైతిక నిబంధనలలో-సర్వతోముఖంగా నవ్య పద్ధతులను స్వాతంత్ర్య సంరక్షణకోసం చైనా ఆచరణలో పెట్టక తప్పింది కాదు.

రాజకీయాలలో విప్లవం ఎలా వచ్చిందో చూదాం. జాతీయజీవితాన్ని ఆధునికయుగ పద్ధతుల ననుసరించి నడపడానికి నీలుగా ఉండే ప్రభుత్వ పద్ధతి కోసం పాటుబడుతున్నారు చైనా వివిధ రాజకీయపక్ష నాయకులు.

మంచు చక్రవర్తుల ముష్కర పరిపాలనలో, ఆధునిక పాశ్చాత్య రాజకీయ దృష్ట్యా పరిశీలిస్తే ఒక ప్రభుత్వపద్ధతే లేదనవచ్చును. మంచూ చక్రవర్తుల నిరంకుశత్వానికి, అక్రమ పరిపాలనకి అంతే లేకుండేది. వారి అసభ్యపు పరిపాలనను గురించి చైనా స్వాతంత్ర్యోద్యమపరిణామాన్ని వర్ణించి నప్పుడు వివరించాము. అట్టి విషాద పరిస్థితులలో ఎంత "నల్లమందు భాయీ" లలోనైనా చైతన్యం పుట్టడం సహజం. దీనికితోడు ఆధునిక విజ్ఞానాన్ని జనసామాన్యంలో వెదజల్లడంవల్ల వారిలో స్వాతంత్ర్యాపేక్ష హెచ్చి, విదేశీయులయెడల అసహనం, అసహ్యత మెండయి, జాతీయత పెంపొందింది. **1925-26**ల మధ్య జరిగిన పోరాటాలకూ, విదేశీవస్తు బహిష్కరణకూ యీ జాతీయభావ విస్తరణమే కారణం. బాక్సరు తిరుగుబాటుకుకూడ ఇదే కారణం. ఈ చిన్ని తిరుగుబాటులు, పోరాటాలే అచిరకాలంలో "కుమిన్

టాంగ్" అనే జాతీయపక్ష రూపం దాల్చినాయి. ఈ పక్షానికి చైనా ప్రజలలో ప్రబల పలుకుబడి ఉండడంచేత స్వల్పకాలంలోనే శక్తియుతమగు కేంద్రప్రభుత్వం, సుస్థిరమైన రాష్ట్రీయ, స్థానిక ప్రభుత్వాలను నిర్మించి, చైనా, జాతీయ ప్రజాప్రభుత్వాన్ని స్థాపించగలిగింది. మూడు దశాబ్దాల కాలంలోనే సుంచూ చక్రవర్తుల ముష్కర పరిపాలనను పూర్తిగా నిర్మూలించి, ఆధునిక పద్ధతుల ననుసరించి ప్రజాప్రభుత్వాన్ని చైనా నిర్మించుకో గలగడం ప్రశంసనీయ విషయం. ఈ విషయంలో మన రాజకీయనాయకులు చైనా స్వాతంత్ర్యోద్యమాన్నుండి నేర్చుకోవలసిన ఆదర్శా లెన్నో వున్నాయి.

ప్రజాప్రభుత్వ స్థాపనకు పూర్వం చైనాలో సైనికాధికారుల అక్రమ పరిపాలన, చైనా ప్రజ అజ్ఞానాంధకారం, అమాయకత్వం, ఎక్కువగా ఉండేవి. డాక్టరు సన్‌యట్ సెన్ తన మేధనంతన్నూ ఉపయోగించి "జాతీయత" అనే వజ్రాయుధాన్ని ప్రజలకు ప్రసాదించారు. ఈ జాతీయతా పునర్జీవనతో విదేశపు పురుగు చైనాలో ఉండకుండా చేయడానికి సంకల్పించుకున్నారు, చైనా ప్రజలు. ఐక్యతకు, ఐకమత్యతకు ముఖ్యస్థానమిస్తూ అంతఃకలహా లన్నింటినీ అణచివేసుకుంటూ చైనాప్రజలు ఏకోన్ముఖంగా విదేశ బహిష్కరణను చేశారు. దానితో చైనా విదేశ శృంఖలాలనుండి విడివడింది. విడివడ్డ స్వాతంత్ర్య చైనా, ప్రజాప్రభుత్వ స్థాపనకు పూనుకుంది. ప్రజా ప్రభుత్వ స్థాపనతోబాటు, సుభిక్ష జీవనానికి తోడ్పడే సాంఘిక, ఆర్థిక సంస్కరణలనుకూడా ఆచరణలో పెట్టింది చైనా.

"జాతీయత, ప్రజాస్వామ్యం, ప్రజల సుభిక్ష జీవనం" అనే మూడు గొప్ప సూత్రాల ననుసరించి డాక్టరు సన్ "కుమిన్‌టాంగ్" పక్షాన్ని స్థాపించారు. ఈ మూడు సూత్రాలే నేటి చైనాలోని ప్రతి రాజకీయపక్షానికి బీజాక్షరాలు. 1924లో డాక్టరు సన్ మరణానంతరం యీ సూత్రాల ననుసరించే "కుమిన్‌టాంగ్" పక్షం ప్రజాప్రభుత్వాన్ని నడుపుతూ వచ్చింది. కాని ఆ పక్షంలోని అతివాదులకూ, మితవాదులకూ అభిప్రాయభేదా లెక్కు

వయి అనేక కక్షలు బయలుదేరాయి. దీనికితోడు 1925లో చైనా రాజకీయాలలో "కొమిన్‌టరన్" అనవసరంగా జోక్యం కల్గించుకుంది. 1937లో జపాను దురాక్రమణ సాగింది. ఇన్ని అడ్డంకులవల్ల డాక్టరు సన్ వేసుకున్న ప్రణాళిక ఆగిపోయి, జాతీయోద్యమం తప్పుదారుల బట్టింది.

చైనాలో పేరుకు చాలా రాజకీయపక్షాలున్నా, "కుమిన్‌టాంగ్", "కమ్యూనిస్టు" పక్షాలే ముఖ్యమైనవి. ప్రజాస్వామ్యవాదులూ, జాతీయసామ్యవాదులూ, యువక చైనా, జాతీయ మోక్షవాదులు, మూడవపక్షం-ఇవీ చైనాలోని వివిధ రాజకీయపక్షాలు. వీటిని పక్షాలనడంకన్న, భిన్న రాజకీయ భావాలనడం సమంజసం. చైనా రాజకీయనాయకులలో అభిప్రాయ భేదాలు, కక్షలు రావడానికి కారణ మేమిటంటే, కొందరు ఆర్థిక, సాంఘిక సంస్కారణలు ఎక్కువగాను, త్వరగాను కావాలంటారు. మరికొందరు తక్కువగాను, నెమ్మదిగాను కావాలంటారు.

చైనా భూశిస్తు విధానంలోను, భూవిభజన పద్ధతులలోను ఆర్థిక సంస్కారణలు పూర్తిగా కావాలంటారు కమ్యూనిస్టులు. కాని "కుమిన్‌టాంగ్" అట్టి సంస్కారణలు నెమ్మదిగా జరగాలంటుంది. ఈ రెండుపక్షాలకూ యీ ఆర్థిక సంస్కారణలలోనే తీవ్ర అభిప్రాయభేదా లున్నాయి. జాతీయరక్షణ, ప్రజాస్వామ్యప్రభుత్వం, ప్రజాబాహుళ్యానికి పూర్తి పౌరస హక్కులు ఉండాలనే కమ్యూనిస్టుపక్షం కోరేది. నేటి చైనాలో కమ్యూనిస్టు పక్షానికికూడా చాలా పలుకుబడి ఉంది.

"లెనిన్"తో సాటికాగల మేధావి "మోజుడూంగ్". "టిమొషెంకో"తో సరితూగగల సేనాని "జనరల్ జుడు"—వీరిద్దరూ నేటిచైనా కమ్యూనిస్టు పక్షానికి నాయకులు. చైనా కమ్యూనిస్టుపక్ష కేంద్రనిర్వాహకవర్గానికధ్యక్షుడై, "మోజుడూంగ్" రాజకీయనాయకుడయ్యాడు. "జనరల్ జుడు" కమ్యూనిస్టు సైన్యానికంతకూ ఏకైక నాయకుడు.

"మోజుడూంగ్" హునాన్‌రాష్ట్రంలోని ఒక గ్రామంలో 1893 లో బీదరైతు కుటుంబంలో జన్మించాడు. తండ్రి రైతవడంవల్ల మో చిన్నప్పటి

నుండి పొలంలో కష్టపడి పనిచేస్తూండేవాడు. మో బీదకుటుంబంలో పుట్టినా, చదువుకోడానికి తగిన ఆర్థిక తాహతు లేకపోయినా, తన విద్యా పిపాస, పట్టుదలవల్ల ఛాంగ్షాలో ఉన్నతవిద్య నభ్యసించాడు. అప్పు డాతడు ప్రపంచ పటాన్ని చూడడం తటస్థించింది. ఈ చిన్ని సంఘటన ఆయనలోని జ్ఞాన పిపాసను రేకెత్తించింది. ఒక్కొక్క జీవితంలో ఒక్కొక్క సంఘటన ఆ జీవితాన్ని ఉత్తమ పథానికైనా లాగుతుంది లేక అధోగతికైనా తోస్తుంది. అలాగే మో జీవితంలో ఆ ప్రపంచపటం కంటపడినప్పటినుండీ ఎంతో మార్పు వచ్చింది. ఆనాటినుండీ, ఆయన విజ్ఞానవిషయికమైన పుస్తకాలన్నీ గ్రంథాలయాలు పరిశోధించి చదివాడు. విజ్ఞానం తనొక్కడే జీర్ణించుకుని, తద్వారా అందలమెక్కి భోగా లనుభవించడం మోకు సరిపడలేదు. తనకున్న విజ్ఞానం, జనసామాన్యానికి వెదజల్లడమే తన విధిగా భావించి అందుకు తోడ్పడే రచన లెన్నో ప్రచురించాడు.

మో శాంతస్వరూపుడు. తత్త్వశాస్త్రజ్ఞుడు. గొప్ప మేధావి. మో నిర్మాత. నూతన సృష్టి సాధించడానికెల్లప్పుడూ కలలుకంటూ, కల్పనలు చేసుకుంటూంటాడు. ఆయన గొప్ప వక్త. చైనాలో ఏ పండితసభలోనైనా తన వాక్పటిమచేత ప్రథమ తాంబూలము నందుకోగల దిట్టరి. కొన్ని రోజులు పత్రికా రచయితగా పనిచేసి తరువాత రాజకీయాలలో దిగాడు. రాజకీయాలలో దిగేసరికి మో జాతీయవాది మాత్రమేను. కాని క్రమంగా సామ్రాజ్య తత్త్వానికీ, పెట్టుబడిదారీ తనానికీ ఉన్న సన్నిహిత సంబంధం ఆయన గ్రహించి సామ్యవాదిగా మారాడు. చీనా "కిసాన్ సభ"కు 1927లో మొట్టమొదటి అధ్యక్షుడయ్యాడు. ఈ పదవిలో ఆయన చూపిన చాకచక్యమే ఆయన్ని భావిరాజకీయ జీవితంలో పైకి తీసుకువచ్చింది. 1930 లో ఆయన కార్మిక కర్షక విప్లవసంఘానికి అధ్యక్షుడయ్యాడు. కమ్యూనిస్టు పక్షానికి మెదడై, చంగ్ కై షెక్‌తో పోరాడుతూ షాంఘై పశ్చిమోత్తర ప్రాంతంనుండి పెకింగ్ వరకుగల 6000 మైళ్ళ రంగంలో విహరించాడు మో. మోను చంపించాలని మార్షల్ చంగ్ కై షెక్ ఎంతో ప్రయత్నిం

చాడు. మోను చంపిగాని, ప్రాణాలతోగాని తెచ్చియిచ్చిన వారికి రూ. 3,75,000 బహుమానమిస్తానని ప్రకటించాడు చంగ్ కై షెక్, కమ్యూనిస్టులమీది కక్షచేత చంగ్ కై షెక్ ఎంతటి క్రూరానికైనా వెనుదీయలేదు. మోవంటి దేశభక్తుని మొదటి భార్యను, సోదరిని ఖైదీచేసి, ఉరిశిక్ష విధించాడు.

మోజుడూంగ్ కు ప్రియమిత్రుడైన జనరల్ జుడు గొప్ప కార్యశూరుడు. పేరెన్నికగన్న సేనాని. కమ్యూనిస్టు పక్షాని కాతడు హృదయము వంటివాడు. జుడు చలాకీ పురుషుడు. ప్రపంచ పర్యటన గావించాడు. కలిపిగోలుతనం అతనిలో మూర్తీభవించింది. అతని హృదయము వెన్నవంటిది. జుడు మితభాషి. ఆయన జెక్‌వాన్ రాష్ట్రంలో జన్మించాడు. ధనికభూస్వామి కుటుంబంలో పుట్టడంవల్ల ఆయన చక్కగా చదువుకోడానికి అవకాశం చిక్కింది. ఉన్నత విద్యాభ్యాసానికి జర్మనీ వెళ్ళాడాయన.

యౌవ్వనమంతా పైలా పచ్చీస్‌గా గడిపాడు. జారత్వం, నల్లమందు త్రాగుడు, అనే దురభ్యాసాలుకూడా వుండేవి. కాని 1927లో వచ్చిన విప్లవం ఆయన జీవితంలో గొప్పమార్పు తీసుకొనివచ్చింది. ఒక్కసారి మాస్కో నగరం వైపు చూచింది ఆయన అంతరాత్మ. అంతటితో ఆయన విలాసయుత జీవనం అంత్యమయి రాజకీయ జీవనం ప్రారంభమైంది. మాస్కోకు పోయి మార్క్సు సూత్రాలను అవగతం చేసుకొని, చైనావచ్చి తన పూర్వపు ప్రభుత్వ సైనిక పదవిని వదులుకొని కమ్యూనిస్టు పక్షానికి ప్రముఖనాయకు డయ్యాడు. సైనిక విషయాలలో ఆయన చూపిన అనుపమాన ప్రతిభవల్ల 1931లో చీనా కమ్యూనిస్టు సేనకు సర్వసేనానిగా ఆయనను ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు.

కమ్యూనిస్టులకు, కుమిన్‌టాంగ్ కు 1927 మొదలు 1937 వరకు జరిగిన వాదోపవాదాలలోనూ, యుద్ధాలలోను, మోజుడుంగ్, జనరల్ జుడు లిద్దరూ కమ్యూనిస్టు పార్టీకి మెదడు, హృదయమూనై మిక్కిలి చాకచక్యంతో మార్షల్ చంగ్ కై షెక్‌వంటి మేధావిని ఆటలాడించారు. చైనా ఎఱ్ఱ



మో

సైన్యాన్ని (రెడ్ ఆర్మీని) నిర్మించి జుడు ఖ్యాతి గాంచాడు. సైనిక విషయాలలో జుడు రష్యా సేనానియగు టిమొషెంకోతో సాటి రాగలడని చెప్పవచ్చును.

'కుమింటాంగ్' 'కమ్యూనిస్టు' పక్షాల ఆశయాలలో ఎన్ని విభేదాలున్నా, జపాను దురాక్రమణను ప్రతిఘటించడంలో మాత్రం ఈ ప్రతిభావంతులందరూ మార్షల్ చంగ్ కై షెక్‌కు కుడిభుజంగా పని చేస్తున్నారు. సుస్థిరమైన కేంద్ర ప్రభుత్వం స్థాపించాలనే కుమిన్‌టాంగ్‌కు, నికృష్ట జీవనంలో క్రుంగి కృశించిపోతూన్న కార్మిక, కర్షకాభ్యుదయానికి పాటుబడాలనే కమ్యూనిస్టులకు సంధి కుదిరింది. శత్రువు నెదిరించడంలో ఈ రెండుపక్షాలు ఏకోన్ముఖంగా పనిచేస్తున్నాయి. ఈ శుభ సంయోగమే చైనా భావి రాజకీయ, ఆర్థికాభివృద్ధికి ఎక్కువ తోడ్పడుతుంది. ఈ ఐక్యతయే యుద్ధ సమయంలో చైనా స్వాతంత్ర్య సంరక్షణకు తోడ్పడుతోంది.



# 4. జాతీయోద్యమ నాయకులు

చారిత్రక పరిణామంవల్ల, పరిసర పరిస్థితులవల్ల నాయకులు బయలుదేర వచ్చును. కాని, సామాన్యంగా ఏ దేశంలోనైనా మహాపురుషులగు నాయకుల ఆదర్శ జీవితాలే ఆ దేశచరిత్రలో అఖండమైన మార్పులు తెచ్చి నట్లు వివిధ దేశాల చరిత్రలు వేనోళ్ళ చాటుతున్నాయి. ఫ్రెంచి విప్లవం, రష్యా విప్లవం—ఆయా దేశాలలో ఆకాలంలోవుండే గొప్ప మేధావులవల్లనే లేవదీయబడి జయప్రదంగా నడుపబడినాయి. నవ్యయుగంలో ఏ దేశచరిత్రయినా ఆదేశపు సాంఘిక, ఆర్థిక, రాజకీయాభివృద్ధిమీదనే గాక, ఆ దేశవు వ్యక్తిగత జీవితాలమీద గూడ చాలా ఆధారపడి ఉంటుంది. మనదేశ రాజకీయాలలో గాంధీజీ అడుగుపెట్టిన దాది మన దేశచరిత్రలో గొప్ప మార్పు వచ్చింది. లేకపోతే యింకే పంథాను నడిచేదో!! ఈ విధంగానే చైనా జాతీయోద్యమ జనకుడును, చైనా విప్లవ మూలపురుషుడు నగు డాక్టరు సన్ యట్ సెన్ వ్యక్తిగత జీవితమే చైనా జాతీయోద్యమ చరిత్రయన్న అతిశయోక్తి కాదు.

## సన్ యట్ సెన్

ఇటలీకి ''మజిని''యు అమెరికాకు "జఫర్‌సన్" ఎటువంటివారో, చైనాకు డాక్టరు సన్ అటువంటివాడు. 1866-వ సంవత్సరం, నవంబరు 12వ తేదీన "హాంగ్ కాంగ్"కు 30 మైళ్లు దక్షిణంగా ఉండే ''ఫాట్-షాన్'' అనే ఒక మారుమూల పల్లెలో సామాన్య క్రైస్తవకుటుంబంలో సన్ జన్మించాడు. ఆయన తండ్రి లండను మిషనరీ సొసైటీలో ఉద్యోగిగా ఉండేవాడు. ఆ మిషనుకు సంబంధించిన ఒక ఆంగ్లేయ స్త్రీ సన్ అంటే ఆప్యాయంగా చూస్తూ ఆంగ్లభాష బాగా నేర్పింది. "హానొలులు" "హాంగ్ కాంగ్" పట్టణాలలోని బ్రిటిషు పాఠశాలలో చదువుకున్నాడు. సన్ పదునెనిమిదవ ఏటనే డాక్టరు కెర్ చే నడపబడే ఆసుపత్రిలో పని

చేస్తూండేవాడు. అప్పుడతనికి వైద్యవృత్తిమీద అభిమానం హెచ్చింది. డాక్టరు జేమ్సు కాంట్లే "హాంగ్ కాంగ్"లో క్రొత్తగా వైద్య కళాశాల స్థాపించాడని తెలిసి సన్ యాట్ సెన్ అచ్చటికి వెళ్ళి అయిదేండ్లు చదువుకుని, ఆ కళాశాలల్లో మొదటివాడుగా ఉత్తీర్ణుడయ్యాడు. 1892లో "మెకావ్" లో వైద్యవృత్తి సాగించాడు. కాని అచ్చటి పోర్చుగీసు డాక్టర్ల పోటీవల్ల సన్ కు ఎక్కువ ప్రాక్టీసు రాకపోయింది. ఇందువల్ల అతడు "కాంటన్" జేరుకున్నాడు. కాంటన్ కుట్ర కేసు జరిగేవరకు డాక్టరు సన్ "కాంటన్" నగరంలోనే వైద్యవృత్తి చేస్తూ, తరువాత అమెరికా, ఇంగ్లాండు దేశాలల్లో ప్రవాసజీవితం గడిపాడు. "సూంగ్ చింగ్ లింగ్" అనే ఆమెను వివాహ మాడాడు. ఈమె చైనా దక్షిణ కోస్తాలోనున్న "హెనన్" ద్వీప నివాసి యగు ఒక వర్తకుని కుమార్తె. డాక్టరు సన్ కు, కుటుంబ బాధ్యతలు, గొడవలు లేవనిన్నీ, అందువల్లనే ఆయన చైనా విప్లవాన్ని జయప్రదంగా సాగించడానికి వీలయిందనీ చాలామంది అనుకునేవారు. కాని అది తెలియనివాళ్లు అనుకునే విషయం. సన్ కు ఇద్దరు కూతుళ్లు, ఒక కొడుకు ఉన్నారు. ఆయన కొడుకు డాక్టరు సన్ ఫో అమెరికాలో వైద్యవృత్తి నభ్యసించి చైనా రాజకీయాలలో ఈనాడు పాల్గొంటున్నాడు. కుటుంబపాశాలకు గురియయి కూడా డాక్టరు సన్ అరచేతులలో ప్రాణాలు పెట్టుకొని చైనా విప్లవ జ్యోతి దీపి జయప్రదంగా నడిపాడు.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది అన్న సామెతకు అనుగుణ్యంగా డాక్టర్ సన్ "హాంకాంగ్"లో వైద్యకళాశాలయందు చదువుకునేటప్పుడే అతని విద్యా పిపాస, దృఢనిశ్చయం ఆచార్యుల ఆకర్షించాయి. సన్ విద్యా పిపాసను గురించి డాక్టరు జేమ్సు కాంట్లీ ఇలా వర్ణించాడు—

"వైద్యవృత్తి కూలంకషంగా అవగతం చేసుకున్నాడు సన్. దానివల్లనే అతని కెంతో పేరువచ్చింది. ఒక్క వైద్యవృత్తేగాక అంతర్జాతీయ శాసనాలు, మిలిటరీ జిత్తులు, నౌకా నిర్మాణం, ఆర్థిక, రాజ్యాంగ నిర్మాణం, రాజకీయ విషయాలు మొదలగు సర్వలోముఖ విజ్ఞానం సన్ ఎంతో శ్రద్ధ

గాన్నూ, సంపూర్తిగానూ నేర్చుకున్నాడు. వివిధ దేశాలు పర్యటనంజేసి వాటివాటి ప్రభుత్వ పద్ధతులను, సంఘనిర్మాణాలను అర్థం జేసుకున్నాడు. లండనులో మా ఇంట్లో వున్నప్పుడు క్షణంకూడా వృథాపుచ్చేవాడు కాడు సన్. ఎల్లప్పుడు విజ్ఞానాభివృద్ధికరమగు ఉత్తమ గ్రంథపఠనమే సన్ చేసేవాడు. విలాసయుత జీవనం అంటే సన్‌కి ఎక్కువ ఇష్టం వుండేదికాదు."

డాక్టరు సన్‌ను స్నేహితులు ఎంతో ఆప్యాయంగా చూచేవారు. ఎప్పుడు కావలిస్తే అప్పుడు పుష్కలంగా డబ్బు ఇస్తూండేవారు. సన్ చాలా సంయమయుత జీవితాన్ని గడిపేవాడు. ఆయనకు కావలసిన నిత్యావసరాలే బహుకొద్ది. వందలకొలది మైళ్ళు కాలి నడకను పోతూండేవాడు. అమెరికాలోవున్న చైనా భాగ్యవంతులు అతని కెంతో డబ్బు ఇస్తామన్నా పుచ్చుకునేవాడు కాడు. కొన్నాళ్ళు గడ్డం పెంచుకుని తలపని చేయించుకోకుండా వుండేసరికి సన్ జపానువాడనుకునేవారు చాలామంది. మామూలుగా చైనావారుండేదానికన్నా కాస్త నల్లగా వుండేవాడు సన్. ఇందువల్ల అతనిలో 'నల్ల' దేశపు నెత్తురు ఏమన్నా కలిసిందేమోనని, సన్ 'హొనొలులు'లో పుట్టాడని చాలామంది అసత్య ప్రచారం చేస్తూండేవారు. గడ్డం, మీసాలు పెంచుకుంటే సన్ అచ్చంగా జపానువాడివలె వుండేవాడు కాబట్టే జపానులో ఆయన్ను వెంటాడే గూఢచారుల బారినుండి సులభంగా తప్పించుకుంటూండేవాడు.

జపాను నుండి సన్ 'హొనొలులు' వెళ్ళాడు. అచ్చటనున్న చైనావారు ఆయనకి ఆశ్రయమిచ్చారు. అచట ఆరు నెలలు గడిపాడు. అచ్చట నుండగా స్వదేశంలోని సంస్కరణ సంఘాలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూండేవాడు. అక్కడనుండి సన్ 'శాన్ ఫ్రాంసిస్కో' నగరానికి వెళ్ళి అమెరికాలో మంచూ గూఢచారులమధ్య మిక్కిలి తెలివితేటలతో తిరుగుతూ తన ఆదర్శ సాఫల్యంకోసం ప్రబల ప్రచారం చేశాడు. ఇంత చాకచక్యంలో సన్ తిరగకపోతే అప్పుడే మంచూ చక్రవర్తుల

చేతులలో పడి చిత్రవధ గావించబడేవాడు. ఎందువల్లనంటే ఆ నాటి మంచూ చక్రవర్తుల గౌర్నమెంటు శాసనాలలో దాక్షిణ్యాని కెక్కడా తావులేదు.

లండను, పారిస్ నగరాలలో గూఢచారుల మధ్య ప్రచారం గావిస్తూ అనుకూలంగా వాతావరణం వున్నప్పుడు స్వదేశానికి వచ్చి విప్లవోద్దేశాలను విరజల్లుతూండేవాడు. అతని ప్రచారంవల్ల నాల్గుమూలల అంటుకున్న విప్లవ జ్వాలలే జగద్విదితమగు బాక్సరు తిరుగుబాటులకు కారణం. చైనా ప్రజలో నుండే సాధుత్వం, శ్రామికత, విప్లవం జయప్రదంగా కొనసాగించడానికి తోడ్పడుతాయనే నమ్మకం సన్‌కు వుంది. ఆ సమయంలోనే 'కల్‌నల్ హోమర్‌లీ' అనే అమెరికా సేనానితో సన్‌కు స్నేహం కుదిరింది. ఒక నాడు హోమర్ అయాచితంగా సన్ దగ్గరకు వచ్చి సన్ నడపబోయే విప్లవంలో తాను కుడి భుజంగా వుంటానని తన సర్వస్వం సన్ ఆదర్శం కోసం ధారపోస్తానని చెప్పాడు. అంతవరకు సన్‌కు అతడెవరో తెలియదు. ప్రక్కనున్న స్నేహితులు సన్‌కు అతన్ని గురించి చెప్పారు. అప్పట్లో 'కల్‌నల్ హోమర్‌లీ' ప్రపంచ సేనానాయకులలోకెల్లా గొప్ప మేధావి యనీ, ఆధునిక యుద్ధ పద్ధతులలో అందెవేసిన చేయనీ అప్పటికి తెలుసుకున్నాడు సన్. మరునాడు సన్ హోమర్ ఇంటికి వెళ్ళి, అతనికి తన ఆశయాలు వివరించి చెప్పి "నేను నా ఆదర్శాన్ని నా జీవిత కాలంలోనే పొందగలిగితే నిన్ను (హోమర్‌లీని) చైనాకు సర్వసేనానిగా చేస్తాను" అన్నాడు సన్. ఆ మాటలు విని హోమర్‌లీ నవ్వి "నీవు చైనా అధ్యక్షుడయ్యేవరకు వేచియుండ నక్కరలేదు. ఈలోపుగానే నా అవసరం నీకుంటుంది. ఒక గట్టి సైన్యం నీ చేతిలో వుంటేనేగాని నీవు రాజ్యాంగ నిర్మాణం చేయనూలేవు. ఒకవేళ చేయగలిగినా నిలబెట్టుకోనూ లేవు. సరియైన తర్ఫీదు కనుక ఇస్తే చైనా సైనికుడు ప్రపంచంలోని ఇతర సైనికుల కన్నా ఎక్కువ చాకచక్యంగా పోట్లాడగలడు" అన్నాడు.

సన్ విప్లవ ప్రచారం చేస్తూన్నప్పుడు ఆయన్ను చంపడానికి ప్రతికక్షులు చేసిన ప్రయత్నాలకు సంబంధించిన కథలు అనేకమున్నాయి.

'నాన్‌కింగ్'లో సన్ ఉన్నప్పుడు ఒకనాడు అతని ఇంటికి ఒక మనిషి వచ్చి "నేను చాలా బీదవాణ్ణి. నాకు భార్య, చాలామంది పిల్లలు ఉన్నారు" అని ఇంకేమో చెప్పబోయాడు సన్‌తో. వెంటనే సన్ గ్రహించి "ఓహో!! ఎవరన్నా నన్ను చంపితే వెయ్యి డాలర్లు నీ కిస్తా నన్నారా?" అని అడిగాడు. "వెయ్యి కాదు బాబూ; అయిదువేలు" అని ఆ ఆగంతుకుడు జవాబిచ్చాడు. "అయితే నిజమే! నా తలంటే నాకు ఏమీ విలువ లేదు. కాని నన్ను చంపితే నీకు నా శత్రువు లిస్తానన్న డబ్బంతా నీకు ముట్టుతుందని నమ్మకమేమిటి? వారి పబ్బం గడుపుకుని నీ కిస్తానన్న డబ్బు వాళ్ళే గుటకాయస్వాహా చేస్తే నీ పెళ్ళాం, బిడ్డలు ఎల్లకాలం మల మల మాడుతూండాలిసిందే కదా!! నీవలె ఎన్ని లక్షలమంది కూడు గుడ్డ లేక అల్లాడుతున్నారో నీకు తెలుసా. నేను నీవాణ్ణి. నా తల నీది. ఐదు వేల డాలర్లకి నా తల బలి యివ్వడానికి సమ్మతిస్తావా? ఏమైనా సరే నేనిక్కడనుండి కదలనని నిన్ను ఎవరు పంపారో వారికి వెళ్ళి చెప్పు" అన్నాడట సన్ ధైర్యంతో. ఆ మనిషి యీ మాటలు విని నిర్ఘాంతపోయి సన్ కాళ్ళమీద పడి క్షమార్పణ కోరి వెళ్ళిపోయాడు. వాడు తాను చేసిన అపరాధానికి తాళుకు తాళలేక మరునాడు బావిలో పడి ఆత్మహత్య చేసుకున్నాడని సన్ విని చాలా చింతించాడు.

జాన్సను తిరుగుబాట్ల తరువాత సన్ అమెరికాకు వెళ్ళాడు. తన ఉద్యమం జయప్రదంగా కొనసాగించడానికి కనీసం పదిలక్షల పౌనులన్నా కావాలని అంచనా వేశాడు సన్. అమెరికాలోని ప్రతి బ్యాంకరు దగ్గరకు పోయి రాజకీయ యాచన చేసేసరికి కావలసినంత డబ్బు వచ్చి పడింది. డబ్బు ప్రోగుచేయడానికి తాను స్వయంగా అన్నిచోట్లకు పోలేక అనుచరులను పంపేవాడు సన్. అందులో కొంతమంది ప్రోగుచేసిన డబ్బును పువ్వులలో పెట్టి సన్‌కు అందించేవారు. మరికొందరు ఎక్కడికక్కడ దిగమింగి కూర్చునేవారు. ఆ విధంగా దిగమింగిన వారెవరో సన్‌కు తెలిసినప్పటికీ, ఆయన చైనా అధ్యక్షుడయిన తరువాతకూడ వారిమీద చర్య తీసుకోకుండా,

వారి కర్మం వారే అనుభవిస్తారనే విశాలభావంతో వదలివేశాడు. చైనా దేశస్థులు స్వార్థపరులనీ, నిర్దాక్షిణ్యులనీ, పాశ్చాత్యదేశాలలో చేసే ప్రచారం శుద్ధ అబద్ధం. అమెరికాలో సన్ ఒక సభలో మాట్లాడుతుండగా, క్యాలిఫోర్నియాలోని ఒక చైనా లాండ్రీవాడు ముగ్ధుడయి, తాను యిరవై ఏండ్లనుండి కూడబెట్టిన డబ్బు ఒక సంచీలో వేసి సన్ ఉండే బసకు వెళ్ళి అతని కిచ్చి అతిపతీ చెప్పకుండా వెళ్ళిపోయాడు. చైనావారి స్వార్థరాహిత్యాని కిదియే తార్కాణం.

ఈ విధంగా డబ్బు సేకరించుకుని సన్ స్వదేశానికి వెళ్లాడు. అప్పటికి యాన్-షి-కాయ్ అనే యింకో నాయకుడు "పెకింగ్" నగరానికి చుట్టు ప్రక్కల ఏడు పటాలాలను తన ఆధిపత్యలలో నడుపుతూండేవాడు. డౌగాల్ చక్రవర్తిని చనిపోయేసరికి రాజకీయ వాతావరణం మారితే చైనా భావిభాగ్యోదయం యాన్-షి-కాయ్ చేతిలో పడుతుందేమోనని సన్ అనుకున్నాడు. కాని, సన్ కుండే పలుకుబడి యాన్-షి-కాయ్‌కి లేక పోవడంవల్ల తాను లేకుండా యాన్-షి-కాయ్ స్వాతంత్ర్యోద్యమాన్ని బయు పర్విదంగా నడపలేడని సన్ కు తెలియకపోదు. యాన్-షి-కాయ్‌తో అంత వరకు సన్ కు పరిచయం లేకపోయినా, యాన్-షి-కాయ్ మంచూ చక్రవర్తుల తరఫున పోట్లాడడానికి కిష్టగించడని మాత్రం సన్ కు నమ్మకముండేది. మంచూరియాలో ఒక విప్లవకారి చేతిలో ఒక పటాలముండి. సమయము వస్తే అతడూ "పెకింగ్" ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోట్లాడడానికి సిద్ధపడతాడని సన్ కు తెలుసు. ఇక అప్పట్లో చైనాకున్న నావికాబలమంతా కలిపితే నాలుగు ఓడలు. అందులో ఒక్కటిమాత్రం 4,000 టన్నులది. తతిమా మూడు 2,900 టన్నులవి. ఆ ఓడలలో పనిచేసే నావికోద్యోగులు, నావికులుకూడ విప్లవోద్దేశ్యాలున్నవారే. కాబట్టి చైనా నావికాబలాన్ని హస్తగతం చేసికోడం మిక్కిలి సులభమని సన్ గ్రహించాడు. దక్షిణ చైనా అంతటా విప్లవం లేవదీయడానికి తగిన వాతావరణముంది. దక్షిణ చైనా ప్రజలంతా విప్లవజ్వాలలో దూకడానికి సంసిద్ధులయి. ఉండడమేగాక,

విప్లవకారులు కొందరు, క్వాంగ్సీ, క్వాంటుంగు, హూనాన్ రాష్ట్రాలలోని యోధాగ్రేసరుల సందరిని ప్రోగుచేసి సైన్యాలుగా ఏర్పరిచారు. ఈ రాష్ట్రాలలోనే చైనాలోని సుప్రసిద్ధ యోధులు బయలుదేరింది.

యాన్-షి-కాయ్, సన్ విప్లవ ప్రణాళికకు కొంతవరకు అడ్డు తగిలాడన్నాలి. యాన్-షి-కాయ్ తనకు ప్రతిబంధకంగా ఎక్కువరోజులు వుండగలడేమోననికూడా సన్ భయపడ్డాడు. కాని 1910 లో యాన్-షి-కాయ్ సన్‌తో సమాధానపడ దలచి ఆయనవద్దకు ఒక సేవకుణ్ణి పంపాడు. కాని సన్ నమ్మలేక పోయాడు, ఒకవేళ అది యాన్-షికాయ్ జిత్తులేమోనని. పది హేనేండ్లు కష్టనిష్ఠురాల కోర్చి చివరికి యాన్-షి-కాయ్ వలలో పడాలిసి వస్తుందని భయపడ్డాడు సన్. "నేను మోసపోనని మీ ఘనత వహించిన యాన్-షి-కాయ్‌గారితో చెప్పు. దైవ ప్రసాదితమని చెప్పుకునే తుచ్ఛ చక్రవర్తిత్వ విధానం ఎంతో కాలం నిలవదులే!" అని ఆవచ్చిన సేవకుణ్ణి త్రిప్పి పంపేశాడు సన్. లేకపోతే 1911 లో వచ్చిన చైనా విప్లవం ఏడాది ముందే జరగాలసింది. తన నిరంతర కృషి ఫలితంగా 1912 లో చైనా ప్రజాస్వామ్య ప్రథమ అధ్యక్షుడయ్యాడు సన్. 1895లోనే డాక్టరు సన్ చైనా జాతీయ సంఘాన్ని స్థాపించాడు. 1905లో "కుమిన్‌టాంగ్" అనే జాతీయ పక్షాన్ని అమెరికా మొదలైన విదేశాలలో ఉండే చైనా భాగ్యవంతుల సహాయంతో స్థాపించగలిగాడు. 1911లో జరిగిన చైనా విప్లవంలో గొప్ప కృషి సలిపి మంచూ చక్రవర్తుల ముష్కర పరిపాలననుండి చైనాకు విముక్తి గలిగించాడు. 1912లో స్వాతంత్ర్య చైనా కధ్యక్షుడయి, 1917లో దక్షిణ చైనాలో విప్లవం లేవదీసి, నాన్‌కింగ్, నగరంలో దక్షిణచైనా ప్రభుత్వం స్థాపించాడు. 1921లో మళ్ళీ చైనా ప్రజాస్వామ్యాని కధ్యక్షుడయ్యాడు. "బొరోడిన్" అనే రష్యన్ స్నేహితుని సలహాతో "కుమిన్‌టాంగు"ను కొంతవరకు సంస్కరించి సుస్థిరమైన పునాదులు వేశాడు. కమ్యూనిస్టులంటే ప్రాణంగా చూచేవాడు.

చైనా ప్రజాస్వామ్యానికి ప్రథమ అధ్యక్షు డవడానికి కొద్దిరోజులు ముందుగా 1911వ సంవత్సరం నవంబరులో సన్ తన గురువు, స్నేహితుడు,

సంరక్షకుడునయిన డాక్టరు జేమ్సు కాంట్లీని చూచేందుకు లండన్ వెళ్ళాడు. అప్పుడు జరిగిన ఒక ఘట్టం వింటే సన్‌యట్‌సెన్ నిర్మల నడవడిక, దయార్ద్రిత, నిరాడంబరత్వం మన కర్థమవుతాయి.

టెలిగ్రామొకటి జేబులో పెట్టుకుని డాక్టరు కాంట్లీగారి తలుపు తట్టాడు సన్. డాక్టరు కాంట్లీగారి పనికత్తె ముసిముసి నవ్వులతో మామూలుగా వచ్చి తలుపు తెరిచింది. సన్ ఆమెను బాగా ఎరుగుండబట్టి కరస్పర్శచేసి, కుశలప్రశ్న లడిగాడు. ఇతడు, త్వరలోనే 40 కోట్ల ప్రజలకు అధిపతి అవుతాడని పాపమా పనికత్తెకేం తెలుసు!! ఆతని జేబులోనున్న టెలిగ్రామును, సన్‌ను చైనా ప్రజాప్రభుత్వానికి ప్రధమ అధ్యక్షుడుగా ఉండమని కాంటన్‌నుండి వచ్చిందని ఆమె కేమి తెలుసు!! మామూలుగా వచ్చే సన్ అనుకుంది.

ఆ టెలిగ్రాము వింతచరిత్ర వింటూంటే ఆశ్చర్యంగా వుంటుంది. "సన్ వెన్, లండన్" అని దానిమీద అడ్రసు వ్రాశారు. అది కాంటన్‌నుండి వచ్చింది. "సన్ వెన్" అని సన్‌ను లోకులు పిలుస్తారు. "సన్‌యట్‌సెన్" అనేది అతని కుటుంబీకులు పెట్టుకున్న పేరు. "సన్ వెన్, లండన్" అనే అడ్రసు మరీ అసంపూర్తిగా ఉండడంచేత పోస్టాఫీసువారు "చైనా రాయబారి వర్గం మేడలో దర్యాప్తుచేయి" అనే రిమార్కు వ్రాసి పోస్టుబంట్రోతు ద్వారా పంపారు. అది చైనా రాయబారివర్గంవారు చూచి ఆ బంట్రోతును డాక్టరు కాంట్లీ యింటికి పంపిస్తూ, ఆ టెలిగ్రాము తీసుకోవలసిన మనిషి అచ్చట ఉందీలేందీ కనుక్కొని చెప్పమన్నారు. బంట్రోతు వచ్చేసరికి డాక్టరు కాంట్లీ యింట్లోలేడు. కాని అదృష్టవశాత్తు కాంట్లీ సతీమణి ఉంది. ఆ టెలిగ్రాము చూచుకుంది. అది సాంకేతికాక్షరాలతో వుంది. ఆ సాంకేతికాక్షరాలమధ్య ఎవరో క్రొత్తగా చైనా అక్షరాలు వ్రాసినట్లు కనుపిస్తోంది. ఇదంతా చైనా రాయబారి వర్గంచేసిన కుట్రయని ఆమె తన సూక్ష్మబుద్ధితో గ్రహించింది. "సన్ వెన్" తమ యింట్లో వున్నాడనిగాని, భలానప్పుడు వస్తాడనిగాని చెపితే సన్‌ను చిక్కులపాలు చేయాలిసి వస్తుం

దని ఆమె తెలుసుకుంది. కాని టెలిగ్రాములోని సారాంశం సన్ తప్పక తెలుసుకోదగిన దేమో !! ఎలాగా అని ఆమె తన సునిశిత బుద్ధితో ఆలోచించింది. వాకిట్లో బంట్రోతు తొందరపడుతున్నాడు. టెలిగ్రామన్నా తిప్పి యివ్వాలి లేదా ఫలానప్పుడు రమ్మనాలి. ఇక ఇది కాదని ఆ టెలిగ్రామును పొందికగా ఎలావున్నది అలాగా కాపీ చేసిందామె. సాంకేతికాలే కాకుండా, క్రొత్తగా చేర్చినట్లున్న చైనా అక్షరాలుకూడా ఓపికగా కాపీ చేసి ఆ టెలిగ్రాము బంట్రోతు కిచ్చి "సన్ వెన్" లేడనీ, రాడనీ చెప్పి పంపేసింది. సన్ కొన్ని గంటల తరువాత వచ్చాడు. కాంట్లీ సతీమణి తాను కాపీచేసిన ఆ టెలిగ్రాము యిచ్చింది. చూచుకుని ఊరుకున్నాడు సన్. అంత ప్రాణ మిత్రులయినా ఆ టెలిగ్రాములోని సారాంశం మరునాటివరకు కాంట్లీ దంపతులతో ముచ్చటించనేలేదు సన్. మరునాడు ఆ టెలిగ్రాము చిత్రచరిత్రను కాంట్లీ సతీమణి సన్‌కు చెప్పింది. ఆ చైనా అక్షరాలుకూడా ఎవరు కాపీచేశారని సన్ ఆశ్చర్యంతో అడిగాడు. తానేనని కాంట్లీ సతీమణి చెప్పేసరికి సన్ నిర్ఘాంతపోయాడు. కాంట్లీ సతీమణి కలంతో చైనా అక్షరాలంత పొందికగాను, సరిగ్గాను వ్రాయగలిగినందుకు సన్ ఎంతో అభినందించాడు. ఇంతకీ ఆ టెలిగ్రాములో ఏముందీ అని తెలుసుకోడానికి కుతూహలపడుతూన్న కాంట్లీ దంపతులకు ఆ సంగతే చెప్పడం మరచిపోయాడు సన్. "టెలిగ్రాములో ఏమన్నా రహస్య విషయా లున్నాయా ?" అని కాంట్లీ దంపతు లడిగితే అప్పుడు సన్ స్థాయిగా యిలా అన్నాడు—"అయ్యో!! ఇంకా మీతో నేను చెప్పనేలేదూ!! చైనా నూతన ప్రజాస్వామ్యానికి నన్ను అధ్యక్షుడుగా ఉండమని ఆహ్వానం" అని. దీనివల్ల డాక్టరు సన్ యొక్క నిరాడంబరత్వం, స్వార్థరాహిత్యం తేట తెల్లమగును.

"చైనాకు అధ్యక్షుడుగా నుండడం నీకు సమ్మతమేనా" అని డాక్టరు కాంట్లీ అడిగాడు సన్‌ను. "యీలోపుగా తాత్కాలికంగా యీ ఆహ్వానాన్ని ఒప్పుకుంటాను, నాకన్నా మంచివారెవ్వరూ దొరకకపోతే"

నన్నాడు సన్. దీన్ని బట్టికూడా సన్ యాట్ సెన్ లో స్వార్థాని కెక్కడా చోటులేదని విశదమవుతోంది.

"సన్"ను చంపి అతని రక్తసిక్తమైన తలను తెచ్చినవాళ్ళకు ఒక లక్ష పౌన్లు బహూకరిస్తామని ప్రకటించారు మంచూ చక్రవర్తులు. తన తల కింత విలువుందని, ఆ తల తుంచడానికి తుచ్ఛులు తీవ్రంగా క్షణం క్షణం ప్రయత్నిస్తున్నారనీ తెలిసికూడా ఆ తుచ్ఛులు తిరిగే న్యూయార్కు, పారిస్, లండన్ నగరవీధులలో సన్ యాట్ సెన్ నిర్భయంగా చీమకుట్టకుండా తిరిగేవాడు. గూఢచారులు అతని వెనువెంట తైనాతీలవలె తిరిగేవారు. "మంచూ చక్రవర్తులు తమ దౌర్జన్యంతోనూ, గూఢచార వర్గంతోనూ చైనాను పరిపాలింప గలిగారు" అని డాక్టరు కాంట్లీ అన్నమాటలు ముమ్మాటికి నిజం. పల్లెలలో, పట్టణాలలో, కర్మాగారాలలో, రైలుబండ్లలో—ఎక్కడ చూచినా గూఢచారమయం మంచూ ప్రభుత్వంలో. ఈ గూఢచారవర్గం అత్యాచారాలకు అంతేలేదు. ఆవలిస్తే పేగులు లెక్కపెడతారు. ఇట్టి క్లిష్ట పరిస్థితులలో అజ్ఞానాంధకారంలో మునిగియున్న చైనా ప్రజలో తన ప్రచండ ప్రచారంవల్ల చైతన్యం కలిగించి విప్లవాన్ని రగుల్కొల్పాడు సన్. అతని పేరు చెపితేనే చైనాప్రజలో స్వాతంత్ర్యాపేక్ష, ధైర్యస్థైర్యాలు పొంగి పొరిలేవి.

ఎన్నో ఆటంకాలున్నా చైనావంటి విశాలదేశంలో అజ్ఞానాంధకారంలో మునిగియున్న చైనాప్రజలో చైతన్యం కలిగించడానికి డాక్టరు సన్ చేసిన అఖండ ప్రచారం మరొక నాయకుడికి సాధ్యమయ్యేదికాదు. చైనా ప్రజలో వుండే సాధుత్వం, శ్రామికత కలిసి చైనా నొక ప్రజాస్వామ్యం చేయడానికి అవకాశం కల్పించాయి. ఇట్టి అనుకూల పరిస్థితులలో సన్ అమోఘ కృషిచేసి విప్లవజ్వాలలు నాలుగు మూలలా అంటించాడు. సన్ తన జీవితాదర్శాన్ని పూర్తిచేసుకున్నాడు. ఇక విప్లవ ఫలితం తానే అనుభవించాలనేది అతని కెన్నడూ లేదు. తన మాతృదేశం ప్రపంచంలోని నవనాగరిక స్వాతంత్ర్య దేశాలతోపాటు సమానముగావుంటే చాలుననే సన్

ఆశయం. మంచూ చక్రవర్తుల ముష్కర పరిపాలనకు గురియగుచు డాక్టరు సన్ పడ్డ కష్టాలకు అతడు కాబట్టే నెగ్గాడు. అతడు దేవుణ్ణి నమ్మి పని చేశాడు. దేవుడు అతని జీవితాశయం గొప్పదని గ్రహించి అతని ఆశయాలను సానుకూలం చేశాడు. డాక్టరు సన్ పేరుచెపితే చైనా సైనికులు గంతేసి యుద్ధానికి కాలు దువ్వేవారు. వారినంత ఉద్రిక్తులను చేయగలిగే శక్తి వుంది సన్‌లో.

డాక్టరు సన్ జీవితమంతా ఒక గొప్ప నాటకంలాగ వుంటుంది. 1896వ సంవత్సరం అక్టోబరు 11వ తేదీ సన్ జీవితంలో ప్రాముఖ్యమైంది. ఆ సంవత్సరంలోనే అక్టోబరు మొదటివారంలో లండన్ జేరుకున్నాడు సన్. కాంటన్ కుట్ర కేసునుండి బయటపడి వివిధదేశాల్లో ప్రవాస జీవితం గడపిన తరువాత జేరుకున్నాడన్నమాటేగాని ఒక్క ఘడియ మనఃస్థిమితం లేదతనికి. ఒక హోటలులో వుండేవాడు. డాక్టరు కాంట్లీ కుటుంబం ఆయనకి ప్రాణ స్నేహితులు. డాక్టరు మాన్‌సన్ కూడా ఆయనకి ముఖ్య స్నేహితుడు.

1896లో అక్టోబరు 11వ తారీకున ఉదయం పదిన్నర గంటలకు సన్ చర్చికి పోతున్నాడు. మంచూప్రభుత్వపు గూఢచారులు, ఆయన్ని మోసం చేసి చైనాప్రభుత్వ రాయబారివర్గం ఉండే మేడలోకి తీసికునిపోయి ఖైదులో బంధించారు. ఖైదులో పడ్డప్పటినుండీ, నీటిలోంచి బయటపడ్డ చేపవలె కొట్టుకుంటూ తనలోవుండే స్వాతంత్ర్య దీక్షను కార్యరూపంలో పెట్టడానికి ఖైదునుండి విముక్తిగావడానికి డాక్టర్ సన్ విశ్వప్రయత్నం చేశాడు.

డాక్టరు సన్‌ను ఒకగదిలో పెట్టి తాళం వేశారు. అతనికి పాలు మాత్రం ఇచ్చేవారు. ఆ గది తుడవడానికి ఇంగ్లీషు పనివాళ్లు వచ్చేవారు. వారి ద్వారానైనా తన మిత్రులకు తన దుస్థితిని అపాయస్థితిని, తెల్పుతూ ఉత్తరాలు పంపుదామని ప్రయత్నించాడు సన్. కాని ఆ పనివాళ్ళుకూడా తమ ఉద్యోగాలెక్కడ పోతాయోనని సన్ ఉత్తరాలతని మిత్రులకందజేసే వారు కారు. అక్టోబరు 13-వ తేదీ వచ్చింది. అప్పుడే రెండురోజు లయింది సన్ శత్రు హస్తగతమయి. ఉత్తరం వ్రాయడానికి కాగితం, కలం

లేక జేబు రుమాలుమీద పెన్సిలుతో వ్రాసిపంపేవాడు సన్ తన మిత్రులకు. కాని ఒక్క ఉత్తరం గమ్యస్థానం జేరలేదు.

అప్పట్లోవుండే అంతర్జాతీయ న్యాయశాస్త్ర నిబంధనల ననుసరించి ఏ మనిషైనా చైనా రాయబారివర్గం అనుమానిస్తే నారా మనిషిని శిక్షించ వచ్చును. రాయబారివర్గపు మేడ నాలుగు గోడలమధ్య బ్రిటిషువారి అధికారం ఏమీ చెల్లను. అచ్చట చైనా నిరంకుశ పరిపాలనకు అడ్డు లేనేలేదు. ఉత్తరోత్తర బ్రిటిషు గవర్నమెంటు ఏమైనా సంజాయిషీ అడుగుతుందేమో నని పై అంతర్జాతీయ ధర్మసూత్రానికి (అధర్మ సూత్రమే ననుకోండి) మద్దతుగా వుండేలాగ న సన్‌ను చంపుతామని భయపెట్టి, ఆయనంతట ఆయనే చైనా రాయబారివర్గపు మేడకు వచ్చాడని ఆయనవల్ల ఒక స్టేటుమెంటు పుచ్చుకున్నారు. ఈ కుట్రంతా నడిపింది "హాలిడే మకార్ట్నె" అనే ఇంగ్లీషువాడు. వీడికితోడు దొంగ "టాంగ్" అనే చైనా ఉద్యోగి. వీరిద్దరు మంచూ చక్రవర్తులకు నమ్మికబంటులై ఎట్టి కుట్రలకైనా సాహసించెడి కంటకులు. సన్‌ను చైనాకు పంపి అచ్చట చంపివేద్దామని నిశ్చయించారు.

ఆ నాలుగు గోడల మధ్య సన్ ఉద్రేకం అమోఘుంగా పనిచేసింది. ఆయున్ని సోదాచేసిన తరువాతకూడా సన్ దగ్గర కరెన్సీనోట్లు, చిల్లర డబ్బులు వున్నాయి. ఆ నోట్లలో చిల్లర డబ్బులు బరువుకోసం కట్టి తానున్న గది కిటికీగుండా వీధిలో పడేటట్లు వేసేవాడు. ఎవరైనా తన జీవితం కాపాడుతారేమోనని. 16-వ అక్టోబరునాడు సన్ దైవప్రార్థన చేసుకున్నాడు. అతనిలో ఒక దివ్యజ్యోతి కాన్పించింది. దైవము తనొక గొప్ప కార్యం సాధించడానికే పుట్టించాడనే ఆశ అతనిలో రగిలింది. గది ఊడవడానికే "కోల్" అనే ఇంగ్లీషు నౌకరు వచ్చాడు. వాణ్ణి పలకరించి

"నాజీవితం నీ చేతులలో వుంది. నేనిట్లా ఖైదీగా వున్నానని బయటవున్న నా స్నేహితులకు తెలియజేస్తే నాప్రాణం నిలుస్తుంది. లేకపోతే నన్ను తప్పకుండా ఉరితీస్తారు. నాబోటి జీవితాన్ని చంపడం నీ కిష్టమా లేక

కాపాడడం యిష్టమా ? నీవు దైవాన్ని నమ్మి నీవిధి నెరవేరుస్తావా ? లేక నీ పొట్టకూటి కోసం యీ చైనా రాయబారి వర్గాన్ని నమ్మి నా ప్రాణాన్ని కోల్పోమంటావా ?" అని అతిదీనంగా అడిగాడు సన్. మరునాడు ఏ సంగతీ చెప్తానన్నాడు కోల్. కోల్ యింటికి వెళ్ళి భార్య సలహా అడిగాడు. ఆమె సన్ యందు దయతలచి ఆయనకు సహాయం చేయవలసిందిగా భర్తకు బోధించింది. మరునాడు సన్ ఉత్తరం తీసికెళ్ళి డాక్టరు కాంట్లీకి యిచ్చాడు కోల్. కాంట్లీ జవాబు సన్‌కు అందజేశాడు. తన భర్తకు సదుపదేశము చేయడమే గాకుండా 1896 అక్టోబరు 17-వ తేదీన కోల్ భార్య సన్ యొక్క వివరాలన్నీ తెలుపుతూ డాక్టరు కాంట్లీ కొక ఉత్తరం వ్రాసింది. అది ఆయనకు ఆరోజు రాత్రి పదకొండింటికి అందింది.

నిజంగా డాక్టరు సన్ తన స్నేహితుల నెన్నుకోవడంలో మంచి శ్రద్ధ వహించాడనే చెప్పాలి. ఆయన స్నేహితులు విదేశీయులైనప్పటికీ సమయం వచ్చిందంటే తమ ప్రాణాలు అడ్డం వేసేవారు. డాక్టరు జేమ్సు కాంట్లీ అనే ఇంగ్లీషు స్నేహితుడే సన్ జీవితాన్ని కాపాడి చైనా స్వాతంత్ర్యానికి పునాదులు వేశాడనాలి. కోల్ భార్య వ్రాసిన ఉత్తరం అందగానే డాక్టరు కాంట్లీపడిన శ్రమ, ఆవేదన యింతింత కాదు. మరునాడు, దురదృష్టవశాత్తు ఆదివారమయ్యింది. గవర్నమెంటు కచ్చేరీలన్నీ మూసేశారు. అయినా విశ్వప్రయత్నం చేశాడు సన్ విముక్తికోసం. ఆయనకి తెలిసిన పోలీసు ఆఫీసర్లకి చెప్పాడు. గవర్నమెంటుకు ఒక స్టేటుమెంటు పంపాడు. చైనా రాయబారివర్గంవారు సన్‌ను అక్రమంగా నిర్బంధించారనీ, ఆయన్ని చంపడానికికూడా ప్రయత్నిస్తున్నారనీ ప్రతిపత్రికకు ప్రకటనార్థం పంపాడు. చైనా రాయబారివర్గపు మేడనుండి సన్‌ను బయటకు తీసుకుపోకుండా కాపలా కాసేందుకు గూఢచారులను తన స్వంత ఖర్చులమీద నియోగించాడు కాంట్లీ. అప్పట్లో సన్ చైనా నిరంకుశ ప్రభుత్వంచేత చిత్రవధ గావింపబడకుండా కాపాడడానికి సన్ యొక్క ఇంగ్లీషు స్నేహితులలో ఉండే సౌభ్రాతృత్వం, ఇంగ్లీషువారి వార్తాపత్రికలకున్న స్వేచ్ఛ, లండను పోలీసులలోని

నిజాయితీ తనం, బ్రిటిషు ఉద్యోగస్థులు ప్రజలయెడ చూపే ఆదరణ ఎటు పయ్యాయని చెప్పాలి.

1896 అక్టోబరు, 18 వ్రశాంతిరోజగు ఆదివారం ఎలాగయితేనేం గడిచింది. 19వ తారీఖు సోమవారం వచ్చింది. కోల్ కృపవల్ల ఇంగ్లీషు పత్రికలలో తన నిర్బంధాన్ని గురించి పడిన రిపోర్టు చదువుకుని డాక్టరు సన్ కొంత సంతోషించాడు. స్వాతంత్ర్యాపేక్ష గలిగిన ఇంగ్లీషు పత్రికల సహాయంవల్ల తన కింకా మోక్షముందని ధైర్యం వచ్చింది సన్‌కు. సోమవారం నాడు సాయంకాలం నాలుగున్నరకు సర్ హాలిడే మకార్ట్నె పిలుస్తున్నాడని కాపలావారు డాక్టరు సన్‌ను మేడమీదించి క్రిందికి తీసుకువచ్చి, బూట్లు, టోపీ, కోటు వేసుకోడానికి అనుమతిచ్చారు. మళ్ళీ ఎక్కడికి తీసుకు పోతారోనని సన్ కు గుండెలు పీకుతున్నాయి. కాని ఇంతలోనే తన ప్రాణ మిత్రుడును, ఆపద్బాంధవుడునగు డాక్టరు కాంట్లీ, ఒక పోలీసు ఇన్స్పెక్టరు, విదేశాంగ కార్యాలయానికి సంబంధించిన ఒక ఆఫీసరు—సన్‌కు కనుపించే టప్పటికి సన్ సంతోషంతో ఉప్పొంగిపోయాడు. విదేశాంగ కార్యాలయ ఆఫీసరు ఒక చిన్న ఆజ్ఞాపత్రాన్ని సర్ హాలిడే మకార్ట్నెకి చూపించాడు. అదే సన్‌ను బంధ విముక్తుణ్ణి చేయమని విదేశాంగ కార్యాలయం ఇచ్చిన హుకుం. దాన్ని శిరసావహించక తప్పింది కాదు మకార్ట్నెకి. అంతటితో సన్ ప్రాణాలతో బయటపడ్డాడు.

లేకపోతే చైనా చరిత్ర మరొకరీతిగ చదువుకోవలసి వచ్చేదే! ఈ విచిత్ర సంఘటనలలో తన ప్రాణాలు రక్షించుకుని సన్ చైనా జాతైక్యతకు, స్వాతంత్ర్యానికి ప్రబల ప్రయత్నం చేశాడు. నిరంకుశప్రభుత్వం పెట్టే పలు బాధల కోర్చి, నిద్రావస్థలో జోగుతూన్న చైనాజాతిలో చైతన్యం కలిగించిన గొప్ప రాజకీయవేత్త సన్. ఆయన చరిత్ర ప్రపంచ ప్రముఖుల చరిత్రలలోకెల్ల ఆదర్శపాత్రమైనది. నిజంగా ఆయన జీవితముయొక్క పరుగు మనోవేగంతో పరుగెత్తాడు. ఆయన జీవితాదర్శాన్ని జయప్రదంగా చూరగొన్నాడు. తద్వారా ఆయన జీవితాన్నే సార్థకం చేసుకున్నాడు.

చైనాలో జరిగిన వివిధ యుద్ధాలలో చైనా సైనికులు డాక్టరు సన్ నాయకత్వం క్రింద పోట్లాడుతున్నప్పుడు గాయపడ్డ సైనికులు, గాయాలకు కట్లు కట్టుకోగానే మరల యుద్ధరంగానికి ఉరికేవారని ఒక ఆంగ్ల వైద్యుడు వ్రాశాడు. గాయపడ్డ సైనికులను ఆసుపత్రిలో చేరిస్తే మర్నాటికి వారు ఆసుపత్రిలో ఉండకుండా యుద్ధరంగానికి ఏర్పాత్రిపూటో పారిపోయేవారు. ఇదివరకు తగిలిన దెబ్బలేగాక యింకా మరికొన్ని తగిలించుకుని ఇక పోట్లాడడానికి బొత్తుగా సత్తువలేని సమయంలో వైద్యశాలకు వచ్చేవారు చైనా సైనికులు. ప్రపంచంలోని సైనికులలో కెల్లా చైనా సైనికులు మిక్కిలి ధైర్యవంతులనుటకు యిదియే నిదర్శనము. చైనావారిలో శూరత్వము, వీరత్వము చావలేదని చెప్పుట కిదే తార్కాణం. చైనాలో నున్న యిట్టి గొప్ప యోధాగ్రేసురలను సక్రమమార్గంలో నడిపి చైనా స్వాతంత్ర్య సమరాన్ని విజయవంతంగా కొనసాగించిన సర్వసేనాని లియాన్-హెంగ్ పేరు చైనా చరిత్రలో సువర్ణాక్షరములలో వ్రాయవచ్చు. లియాన్-హెంగ్ గొప్ప సేనాని. మిలటరీ విషయాలలో గొప్ప మేధావి. అతడు చైనాకు చేసిన గొప్ప సేవకు ఫలితంగా చైనా ఉపాధ్యక్షపదవి నధిష్టించాడు.

ఆధునిక ప్రపంచ చరిత్రలో ప్రజా బాహుళ్యంయొక్క మన్ననలుపొంది అంత చాకచక్యంగా విప్లవాన్ని నడపగల్గిన మహానాయకులలో సన్‌కు పోల్చదగినవాడు నెపోలియన్. ఆఖరి రక్తబిందువు తమ శరీరాలనుండి ప్రవహించే వరకూ నెపోలియన్ సైనికులు అతణ్ణి "చక్రవర్తి హుసార్" అనే అన్నారు. గారిబాల్డి, వాషింగ్‌టన్, మజినీల దేశభక్తి, నెపోలియన్‌కుండే సర్వజ్ఞత్వం సన్‌లో యిమిడి వున్నాయి. ప్రపంచ చరిత్రలో యింతవరకూ ఎన్నడూ జరుగని గొప్ప విప్లవం నడపిన సన్‌యట్‌సెన్ ప్రపంచ విఖ్యాత పురుషుడంటానికి సందేహం లేదు.

డాక్టరు సన్‌యట్‌సెన్ 1925-వ సంవత్సరం, మార్చి 12-వ తేదీన "పెకింగ్" నగరంలో మరణించాడు. అతని సమాధి 'నాన్‌కింగ్' నగరంలో ఇప్పటికీ ఒక జాతీయ యాత్రాస్థలమైంది. డాక్టరు సన్ స్మారక

చిహ్నమైన ఈ సమాధిని చైనా ప్రజలు ఎంతో భక్తి శ్రద్ధలతో గౌరవిస్తారు.

## ఛంగ్ కై షెక్

డాక్టరు సన్ యట్ సెన్ 1925–లో చనిపోయేసరికి అతని అంతరంగిక కార్యదర్శిగ పనిచేస్తూ ఆయన అనుచరులలో ముఖ్యుడైన 'ఛంగ్ కై షెక్' అను ఒకయువకోద్యోగి ఆధునిక చైనా కధిపతియయ్యాడు. 'జార్జి వాషింగ్ టన్' అమెరికాకు ఎట్టివాడో ఛంగ్ కై షెక్ ఆధునిక చైనాకు అట్టివాడు. ఉత్తమ శ్రేణికి చెందిన ప్రముఖ ప్రపంచ సేనానాయకులలో 'షెక్' ఒకడు. 1887–వ సంవత్సరంలో 'ఛెంగ్' అనే కోస్తా జిల్లాకు చెందిన 'ఛికాఫ్' అనే పల్లెటూరిలో పేద కుటుంబంలో జన్మించాడు. తొమ్మిది సంవత్సరాల వయస్సప్పుడే తండ్రి పోయాడు. సంసార బాధ్యతంతా తల్లి మీద పడింది. తల్లి సుగుణాల కుప్ప. ఆమె ధైర్యస్థైర్యాలు, త్యాగశీలం, దయాదాక్షిణ్యాలు షెక్ కు అలవడినవి. షెక్ ను విద్యావంతునిగ చేయడానికి తల్లి ఎన్నో తంటాలు పడింది. కాని, డిగ్రీలుపొందే విద్య నభ్యసించడం షెక్ కు ససేమిరా ఇష్టంలేదు. మాతృదేశమైన చైనా అధోగతిలోవుందని షెక్ గ్రహించాడు. విదేశీయులు చైనాను ఎలా కబళించాలని కోరుతున్నారో తెలుసుకున్నాడు. పాశ్చాత్యదేశాలకున్న ఆయుధ సామగ్రి, సైనిక సంపత్తి, సైనిక తరిఫీదు, ఆధునిక మారణ పరికరాలు తన దేశానికి లేవని చింతించాడు, యువక షెక్. మనస్సులో మాతృదేశ హీనస్థితిని గురించి తర్కవితర్కాలు, ఆలోచనలూ చెలరేగినయి. అంధకారబంధురంలో వున్న అతనికి ఆశాకిరణం ఒకటి ద్యోతకమయింది. ఆర్థికంగా, రాజకీయంగా; సాంఘికంగా తన దేశాన్ని అభివృద్ధిపరచి సాటిదేశాలలో మేటి అనిపించాలంటే చైనాప్రజను ఆధునిక సైనికులుగా తయారుచేయాలని నిశ్చయించాడు, తదనుగుణ్యమైన నూత్న పద్ధతులను త్రొక్కాడు. తాను సైనిక తరిఫీదు పొంది నాయకుడై భిన్నభిన్న శక్తులను ఏకోన్ముఖానికి తెచ్చి ఆధునిక చైనా నిర్మాత అయ్యాడు షెక్. 'పోటింగ్' మిలిటరీ పాఠశాల పరీక్షలో

ప్రథమ తరగతిని ఉత్తీర్ణుడవటంవల్ల ఇంకా నూతనాంశాలను తెలుసుకోవడానికి 'టోకియో' పంపారు. జపానులో మిలిటరీ కళాశాలలో జేరేసరికి షెక్‌కు 19 సంవత్సరాలు మాత్రమే. కొన్నాళ్లు జపాను సైన్యంలో పని చేశాడు. జపానులో వున్నప్పుడు యుద్ధయుక్తులు, సైనిక పన్నాగాలు రాజకీయ తంత్రాలు నేర్చుకుంటూంటే అతని జీవితంలో ఒక ముఖ్య సంఘటన సంభవించింది. అదే చైనా జాతీయోద్యమ పితామహుడగు డాక్టరు సన్ యట్ సెన్‌తో సంపర్కం. అప్పటికి షెక్ వయస్సు 22 సంవత్సరాలు. చంగ్ కై షెక్‌లో అంతర్గతంగా వున్న ప్రతిభను డాక్టరు సన్ గ్రహించి అతడు భావి చైనా విధాత కాగలడని యెంచి అతనికి జాతీయ భావాలు, విప్లవమార్గాలు బోధించి తనకు నమ్మినబంటుగా చేసుకున్నాడు. 1911 లో జరిగిన చైనా విప్లవంనాటికి షెక్ జపానులో ఉద్యోగం చేస్తున్నప్పటికి అది వదలివేసి చైనాకు ప్రయాణమయ్యాడు. 1916 వరకు వివిధ రాజకీయ పక్షాలకుండే విభేదాలను విచ్ఛేదించి విప్లవ జయప్రదానికి కారకుడయ్యాడు చంగ్ కై షెక్. ప్రజల దృష్టి నాకర్షించాడు. అప్పటికే నిజాయితీ, దూరదృష్టి గల ఉద్యోగి యని పేరుపొందాడు. సన్ బ్రతికివున్నంతవరకు ఆయనకు కుడి భుజంగా వుండేవాడు. ఒకప్పుడు షెక్ తన పటాలంతో సన్ ప్రాణాలను రక్షించాడు. రాజకీయాలలో విజయం చూరగొనాలంటే ధనం పుష్కలంగా వుండాలి. ఈ రహస్యాన్ని షెక్ పేనాని గ్రహించాడు. 1917 లో సైనిక వృత్తి వదలి "దళారీ వ్యాపార సంఘం"లో గుమాస్తాగా జేరి ధనమార్జించాడు. 1921 లో చైనా మిక్కిలి అరాచకంగా వుంది. అది గ్రహించి షెక్ తిరిగి రాజకీయాలలో ప్రవేశించాడు. డాక్టరు సన్‌కు చేదోడుగా వుండి స్వాతంత్ర్య సమరంలో ప్రధానపాత్ర వహించాడు. ఒకసారి యుద్ధప్ర ఓడమీద సన్‌తో ఏకదీక్షగా 54 గంటలు రాజకీయాలు చర్చించుతూ కాలం గడిపాడు. చైనాదేశాన్ని ఐక్యపరచే శక్తిసామర్థ్యాలు చంగ్ కై షెక్‌కు వున్నాయని అనుభవంమీద తెలుసుకున్నాడు సన్. 1923 లో రష్యా వెళ్లాడు. రష్యాలో జరిగే ప్రభుత్వ ప్రకరణలన్నీ షెక్‌కు నచ్చాక

పోయినా "ట్రాట్‌స్కీ" చెప్పిన యీ క్రింది మాటలు మాత్రం షేక్ ఎప్పుడూ మననం చేసుకునేవాడు—"ఓర్పు, చురుకుతనం-ఈ రెండే విప్లవ సంఘానికి ముఖ్యాంశాలు." 1924 లో కాంటన్‌కు తిరిగి వచ్చాడు. "వాంపో మిలిటరీ పరిషత్తు"ను స్థాపించాడు. ఈ పరిషత్తులో చైనా భావి భాగ్యోదయానికి సహాయపడి స్వాతంత్ర్య సంపాదనా యజ్ఞవేదిక మీద ఆత్మార్పణం చేసే వీరాధివీరులు తయారవుతారు. 1925 లో డాక్టరు సన్ భౌతిక శరీరాన్ని చాలించిన తరువాత షేక్ సర్వ సేనాధిపతి అయ్యాడు. 1926 మొదలు 1936 వరకు దేశైక్యతకు పాటుబడ్డాడు షేక్. అతని సైన్యాలు 1926 అక్టోబరులో "వాచంగ్"ను, 1927 ఫిబ్రవరిలో "హాంగ్ చౌ"ను, 1927 మార్చిలో "షాంగ్‌హై", "నాన్‌కింగ్"లను, 1928 జులైలో "పెకింగ్" నగరాలను పట్టుకున్నాయి, 1929-30 లలో జరిపిన దండయాత్రల ఫలితంగా మరికొన్ని విజయాలు చేకూరాయి. కేంద్ర ప్రభుత్వంయొక్క ఆవశ్యకతను ప్రజాసామాన్యం కూడా గ్రహించింది. 1937 లో జరిగిన "సయాన్ సంఘటన" వల్లను, 1937 లో జపాను దండెత్తి రావడం వల్లను, చైనా ఒక "జాతి"గా తయారయింది. ఛాంగ్‌కైషేక్, 1927 డిశంబరు 1-వ తేదీన అమెరికా సంయుక్తరాష్ట్రాలకు చెందిన "వెల్‌మింగ్ టన్" నగరంలోని ఒక వీధి వర్తకుని కడసారపు కూతురగు "సూంగ్ మిలింగ్" అనే ఆవిణ్ణి వివాహమాడాడు. ఈమె చంగ్‌కైషేక్‌కు కుడి భుజంలా వుంటుంది.

చంగ్‌కైషేక్ ఆంగ్లభాష సట్టుగా మాట్లాడుతాడు. చైనా ప్రచురణ శాఖా వుపమంత్రి యగు "కూలింగ్ టాంగ్" అనే ఆయన మార్షల్‌కు తర్జుమాదారుగా వుంటాడు. కూలింగ్‌టాంగ్ ఛంగ్‌కైషేక్‌కు తలలో నాలుకవంటివాడు. చంగ్‌కైషేక్ జీవిత చరిత్రకూడా ఆయన వ్రాస్తున్నాడు. చైనాదేశీయుల ముఖాల్లో శాంతరసం మూర్తీభవించి వుంటుంది! ప్రాముఖ్యమైన విషయం అతితీవ్రంగా మాట్లాడుతున్నా సరే ముఖం చిట్లించుకోడం చైనావారి ప్రకృతికాదు. చంగ్‌కైషేక్‌లో పై రెండు గుణాలు మూర్తీభ

విరిచాయి. ఆయనది నున్నటి గుండు. మరి ఆ గుండులో ఏమున్నదో కాని ముఖ మౌనగాంభీర్య స్వరూపంతో ముక్తసరిగా మాట్లాడుతాడు చంగ్ కై షేక్. ఆ గుండులో గొప్ప రాజకీయ మేధాశక్తి వుండితీరాలి. ఆ మెదడులో పరస్పర విరుద్ధ అభిప్రాయాలు ఒండొంటితో పోరాడుతుంటాయి. ఆయన ఉత్సాహాలకు, ఆశలకు అంతేలేదు. కాని వాటిలో స్వార్థపరత్వం వెతికి చూచినా కనపడదు. చంగ్ కై షేక్ నిగర్వి. చూపులకు సింహంలా వున్నా అతని హృదయం వెన్నలాంటిది. నిష్కల్మషమైన దేశభక్తుడు. గొప్ప త్యాగి. దేశంకోసం తన ప్రాణాన్నైనా అర్పింపగల ధీశాలి.

ప్రజాహృదయాన్ని అర్థంచేసుకుని విప్లవం లేవదీయగల ప్రతిభ చంగ్ కై షేక్‌లో ఎక్కువ కన్పించకపోయినా ఆయనలో ఒక ప్రత్యేకత వుంది. గొప్ప విషయ పరిగ్రహణ శక్తి, నిరాడంబర మేధస్సు, విద్యుల్లతలా విజృంభించే కార్యదక్షత చంగ్ కై షేక్‌లో వున్నాయి. రణశాస్త్రకోవిదులగు పాశ్చాత్య ప్రముఖుల పన్నాగాలుకూడా వమ్మైపోయిన పరిస్థితుల్లో చంగ్ కై షేక్ అంతర్వాణి పలికించిన ఒక్క కిటుకు విజయాన్ని సమకూర్చుస్తుందంటే వింతకాదు.

చైనా స్వాతంత్ర్యరక్షణకోసం అహర్నిశలు ఏకదీక్షగా అకుంఠిత భక్తి విశ్వాసాలతో వీరవిహారం చేస్తున్నాడు షేక్. ఈక్రింద చెప్పిన "కన్‌ఫ్యూషియస్" మత ధర్మాల ననుసరించి చంగ్ కై షేక్ తన జీవయాత్ర చేస్తున్నానని ఒకప్పుడు చెప్పాడు—

"దేశాధిపత్యం వహించేముందు కుటుంబాధికారం వహించాలి. కుటుంబాధికారం వహించేముందామానవుడు తన శరీరాన్ని నీతి నియమాల ద్వారా అదుపాజ్ఞల్లో వుంచుకోవాలి. శరీరాన్ని అదుపాజ్ఞల్లో వుంచుకోవాలంటే మనోనిగ్రహం కావాలి. మనోనిగ్రహానికి నిర్మలమైన భావాలు కలిగివుండాలి. నిర్మలమైన భావాలు కలిగివుండడానికి నిజాయితీ, విజ్ఞానం అభివృద్ధి కావాలి."

## సూంగ్‌లు

సన్, షేక్‌లే గాక చైనా స్వాతంత్ర్యోద్యమానికి సూంగ్ కుటుంబం

పట్టుకొమ్మ. సూంగ్ కుటుంబంలో ముగ్గురు సోదరులు, ముగ్గురు సోదరీ మణులూ వున్నారు. సూంగ్ సోదరులలో పెద్దవాడగు "టి. వి. సూంగ్" గొప్ప ప్రతిభాశాలి. పెద్ద భాగ్యవంతుడు. పేరెన్నికగన్న ఆర్థికవేత్త. సర్వ హోదాలు కలవాడు. జపాను దురాక్రమణ నెదుర్కోడంలో యుద్ధకు చైనాకు కుడిభుజం. అవసరమైతే షేకునుకూడా ఎదిరించిపోరాడేగట్టివాడు. చైనాలో "టి. వి." అనే సంయుక్తాక్షరాలు చెపితేనే చాలు అతని చిత్రకథ అందరూ చెప్తారు. ఎన్నోసార్లు శత్రువులు ఆయన్ని తుదముట్టిద్దామనిచూశారు. కాని టి.వి. సూంగ్ తనకుండే పలుకుబడివల్ల, ధైర్యసాహసాలవల్ల తప్పించుకునేవాడు. ఆయన్ని చూస్తే చాలామందికి గిట్టకపోయినా ఆయన ఆధునిక చైనా కొక గొప్ప నాయకుడనటానికి సందేహంలేదు. చెల్లెలయిన సన్‌యట్‌సెన్ సతీమణి ద్వారా టి. వి. కి సోవియట్ రష్యాతో చాలా పరిచయం వుంది. "లార్డ్ రాబర్టు సెసిల్" నడిపిన అంతర్జాతీయ శాంతి ఉద్యమంలో చైనా పాల్గొనడానికి టి. వి. యే కారకుడు. కాంటన్ బ్యాంకు ఆయనదే. ఆయనకనేక పట్టణాలలో గొప్ప భవనాలు వున్నాయి. విదేశ వ్యాపారస్తుల్లో మంచి పలుకుబడి వుంది. కొందరు దూషించినా, మరికొందరు భూషించినా—మొత్తంమీద జనరల్ చంగ్ కై షేక్ తరువాత ఆధునిక చైనాకు "టి. వి." గొప్ప నాయకుడనక తప్పదు. సూంగ్ సోదరీత్రయంలో ప్రథమురాలగు "సూంగ్ ఏలింగ్" అనే ఆవిణ్ణి "హెచ్. హెచ్. కుంగ్" అనే ధనికుడు వివాహమాడాడు. ఈయన ఇప్పుడు చైనాకు ఆర్థిక మంత్రి. చైనా ఆర్థికాభివృద్ధికి అమోఘ కృషి సలుపుతున్నాడు. తతిమ్మా యిద్దరు సోదరీమణులు చైనా నాయకులగు డాక్టరు సన్, చంగ్ కై షేకులను వివాహమాడి తద్వారా చైనాకు అపారసేవ చేస్తున్నారు. 45 కోట్ల ప్రజ గల చైనాకు సూంగ్ కుటుంబం మార్గదర్శకమై చైనా భావిపరిణామం ఆ కుటుంబంమీదనే ఆధారపడి యున్నది. సూంగ్ కుటుంబంవారంతా ఇప్పటికీ చైనా చేస్తూన్న ఘోర యుద్ధ విజయానికి ఎంతో తోడ్పడుతున్నారు.

# 5. విద్యావిధానము

చైనాలో విద్యావ్యాప్తినిగురించి టూకీగా "స్వాతంత్ర్య చైనా సంగ్రహం" అనే అధ్యాయంలో చెప్పాము. కాని ఒకజాతి సంస్కృతి, పురోభివృద్ధి ఆ జాతి విద్యావిధానంమీద ఆధారపడి వుంటాయి కాబట్టి దాన్ని గురించి విపులంగా తెలుసుకోడం అవసరం.

విద్యయన్న అపారమగు ప్రేమ, విద్యాధికులయెడ మిక్కిలి గౌరవం—ఇవీ చైనా దేశీయుల జాతీయ లక్షణాలలో ముఖ్యమైనవంటే సత్యదూరం కాదు. బెర్ట్రండ్ రస్సెల్‌వంటి గొప్ప విద్యావేత్త యన్నట్లు—"మణుల కన్నా ఉత్తమ విద్యయే వేయిరెట్లు మెరుగని మనసారా నమ్మే జాతి ఈ ప్రపంచంలో చైనా జాతి ఒక్కటే." "విద్య నిగూఢగుప్తమగు విత్తము... విద్యకు సాటిధనంబు లేదిలన్" అన్న నన భర్తృహరి వాక్కుల సారాంశమే చైనాజాతిలో యిమిడివుంది. తన ప్రక్కనే వున్న చైనా జాతిని గురించి జపానుకు బాగా తెలిసినా "సారస్వతంలో మునిగి తేలే జాతి" అని హాస్యాస్పదంగా అంటూంటుంది. చైనాకు గర్భశత్రువగు జపాను నుండి కూడా యిది పొగడ్తే అనాలి. నిజానికి చైనాలో సంఘాన్ని నాలుగు విభాగాలు చేయవచ్చు—పండితులు, కర్షకులు, కార్మికులు, వ్యాపారస్థులు—అంటే ఇట్టి విభజనలో సిపాయికి స్థానమే లేదు!!

ఇందువల్లనే జాతీయప్రభుత్వం స్థాపించినదిమొదలు విద్యావిధానాన్ని గురించి కడుశ్రద్ధ వహిస్తోంది చైనా. 1916 నుండి 1936 వరకు ఎడతెరిపి లేకుండా జాతీయ అంతఃకలహాలున్నప్పటికీ, ఇటీవల జపాను మారణ హోమంలో చైనా నిర్మించుకున్న సుందరమగు పట్టణాలు ఆహుతియైనా, జాతీయ ప్రభుత్వం సార్వజనీన జాతీయ విద్యావిధానం విస్తరింపజేయడం మాత్రం విస్మరింపలేదు. 1931లో అంతర్జాతీయ సమితిచే నియమింపబడిన విద్యావేత్తల సంఘము వ్రాసిన నివేదికలో చైనా విద్యావిధానాన్ని గురించి ఈ విధంగా అన్నారు—

"తరతరాలుగా చైనాదేశం అనేక దురదృష్టాల పాలయింది. అవన్నీ యిక్కడ ఏకరువుపెట్టడం అనవసరం. జాతీయ అంతఃకలహాలు, అంతర్జాతీయ చిక్కులు, ఆర్థిక ఒత్తిడి, అతివృష్టి, అనావృష్టిచేత ఎడ తెగకుండా కలిగే యీతిబాధలవల్ల చైనాజాతి కృంగిపోతున్నా, సభ్యత గల ప్రతి సంఘములోనూ భావిపౌరుల విద్యాభ్యాస మొకటే ముఖ్య విషయమనే దృఢనిశ్చయం కలిగి చైనాప్రభుత్వం విద్యావ్యాప్తి చేయడం, సహజంగా పాశ్చాత్య ప్రభుత్వాలుకూడా చేయజాలనిపని నిర్వహించడం."

చైనాలో 1912 నాటికి 86,318 ప్రాథమిక పాఠశాలలు మాత్రం ఉండేవి. 1932 నాటికి అంటే 20 సంవత్సరాలలో 2,94,000 వరకు పెరిగింది ప్రాథమిక పాఠశాలల సంఖ్య. ఇలాగే ఉన్నత పాఠశాలలసంఖ్య 378 నుండి 3,624 వరకు పెరిగింది. 1912లో 4 విశ్వవిద్యాలయాలుండేవి. కాని 1932 నాటికి 32 విశ్వవిద్యాలయాలు స్థాపించారు చైనాలో.

ఈ అంకెలవల్ల చైనా ప్రభుత్వం చేసిన అత్యద్భుతకృషి విశదమవుతున్నా, చైనా వైశాల్యాన్ని, ప్రజాబాహుళ్యాన్నిబట్టిచూస్తే, విద్యావ్యాప్తికి ప్రభుత్వం ఇంకెంతో కృషి చేయాలనిపిస్తుంది. ఇటీవల ప్రకటింపబడిన అంకెలనుబట్టి చైనాలో నూటికి 20 మందికన్నా అక్షరాస్యులు లేరని తేలింది. జపానుతో ప్రస్తుతం చైనా చేస్తూన్న ఘోరయుద్ధంవల్ల ప్రభుత్వం విద్యావిధానాన్ని గురించి ఎక్కువ శ్రద్ధ తీసుకోలేకపోతోంది.

ఆరేండ్లు ప్రాథమిక పాఠశాలలలో, మూడేండ్లు మాధ్యమిక పాఠశాలలో, మూడేండ్లు ఉన్నత పాఠశాలలో తరువాత కళాశాలలో చదువుతాడు చైనా విద్యార్థి. ఈ కళాశాల చదువు నాలుగేండ్లు మొదలు ఆరేండ్లవరకు ఉంటుంది. జాతీయప్రభుత్వం, చాలమంది విద్యార్థులకు ఉపకారవేతనాలిచ్చి అమెరికా, బ్రిటను తదితర ఐరోపా విశ్వవిద్యాలయాలకు పంపుతూంటుంది, ఆధునిక శాస్త్రపరిశోధనలలో ఆరితేరి రావడానికి. 'నాన్‌కింగ్' నగరంలో 1930—వ సంవత్సరమందు సమావేశమైన ప్రత్యేక సభలో చైనా జాతీయప్రభుత్వం విద్యావిధాన పద్ధతులను నిర్ణయించింది.

ఈ విధాన ముఖ్యోద్దేశ మేమంటే విద్య అనేది పుస్తకపు చదువే గాక, విద్యార్థి చుట్టూ వుండే జాతీయ జీవనానికి ఉపకరించే చదువుగా వుండాలని.

చైనా ప్రజాప్రభుత్వ జనకుడగు డాక్టరు సన్ కు ప్లేటో మహాశయునికి విద్యావిధానాన్ని గురించియున్న భావాలు చాలావరకు వచ్చాయి. ఏ దేశంయొక్క రాజ్యాంగవిధానంలోనైనా, విద్యావిధానానికి మిక్కిలి ప్రాముఖ్యమైన స్థానముందనీ, దేశంలో ప్రతి మనిషిని పౌరస జీవనానికి బాగా పనికివచ్చేటట్లు తరిఫీదు చేయడమే ప్రతి ప్రభుత్వం తన విద్యావిధాన పరమాశయంగా పెట్టుకోవాలని అనేవాడు సన్.

“టూ-స్యూన్” లేక “గొప్ప విద్య” అనే పుస్తకంలో ఉన్న యీ క్రిందికి కన్ఫ్యూషియస్ సూత్రాన్ని సన్ పదేపదే ప్రబోధం చేసేవాడు:-

“విషయ పరిశోధన చేసి నిజాన్ని సాధించు. విజ్ఞానాన్ని విస్తరింపజేయి. నీ నడవడికలో నిజాయితీ తనం చూపించు. మనస్సును సరియైన పంథాలో నడుపుకో. వ్యక్తిగతనీతిని అలవర్చుకో. ఇంటి గెల్చి రచ్చ గెల్వు. నీ కుటుంబాన్ని, నీ దేశాన్ని పాలించుకుని ప్రపంచ శాంతికోసం పాటుపడు.”

అంటే సన్ అభిప్రాయంలో ప్రతి మనిషిని సరియైన పౌరస జీవనానికి పనికి వచ్చేటట్లు చేయడమే విద్యయొక్క పరమావధిగా వుండాలని.

ఇట్టి ఉత్కృష్ట ఆశయాలతో నడుపబడే చైనా విద్యావిధాన ఫలితములగు చైనా విద్యార్థులు జాతీయ జీవనానికెలా తోడ్పడుతున్నారో, స్వాతంత్ర్య సమరంలో ఎలా పోరాడుతున్నారో ముమ్ముందు వివరిస్తాము.

చైనా కోస్తాప్రాంతాన్ని జపాను ఆక్రమించుకోవడంవల్ల విశ్వవిద్యాలయాలున్న చాలా పట్టణాలు శత్రు హస్తగతమైనాయి. ఇందువల్ల చాలా విద్యాలయాలు, జపాను దురాక్రమణనుండి తప్పించుకుని, సురక్షితంగా ఉండడానికి దేశ మధ్యానవున్న కొండప్రదేశాలకు వేలకొలది మైళ్ళు వెళ్ళవలసి వచ్చింది. ఇన్ని కష్టాలకు లోనైనా విశ్వవిద్యాలయాలు ఒక్కరోజైనా వాటి కార్యక్రమం ఆపలేదు. జపాను మారణ యంత్రాలకు గురియైన

చైనా విశ్వవిద్యాలయాల్లోంచి, వేలకొలది విద్యార్థులు పుస్తకాలను, శాస్త్ర సంబంధమైన సామగ్రిని, ఆధునిక విద్యావిధానానికి కావలసిన ఇతరిత పరికరాలను తమ నెత్తిమీద మోసుకుని, దూరానవున్న వేళ మధ్య ప్రదేశాలకు పోయారు. ఈ విధంగా అష్టకష్టాలకు ఓర్చి, ఇదివరకున్న విశ్వవిద్యాలయాలను, కళాశాలలను కాపాడుకోడమే కాకుండా, వాటిలో చదువుకునే విద్యార్థుల సంఖ్య దినదినాభివృద్ధి పొందుతూన్నదని ఇటీవల చైనా విద్యా విషయిక మంత్రివర్గంవారు ప్రచురించిన అంకెలనుబట్టి తేలుతోంది. 1937లో 31,188 మంది విద్యార్థులుంటే 1940 నాటికి 44,422 మంది ఉన్నారు కళాశాలల్లో చదివేవారు.

ఆధునిక విద్యావిధాన విస్తరణ నాంకవరకు ప్రజా ప్రభుత్వస్థాపన తరువాతనే జరిగినా, 1905 నాటికే మంచూ ప్రభుత్వంలోనే పరీక్షావిధానం తీసివేయడంతో పునాది వేయబడిందనాలి. 1905—వ సంవత్సరంలో పరీక్షా విధానం పనికిరాదని ప్రభుత్వం ప్రకటించిన తరువాత 1927—వ సంవత్సరము వరకు విద్యావిషయిక సమస్యలన్నీ అమెరికన్ మిషనరీల చేతుల్లో ఉండేవి. చైనాలో విద్యావ్యాప్తికి అమెరికన్ మతకర్తలు ఎక్కువ కృషి చేశారని చెప్పక తప్పదు. అమెరికావారు తమ మతవ్యాప్తికోసం చాలా డబ్బు వెచ్చించి చైనా విద్యార్థులకు ఉచితవేతనాలిచ్చి అమెరికన్ విశ్వవిద్యాలయాలకు పంపేవారు. ఈ అమెరికన్ మిషనరీల అపారకృషివల్ల చైనా విద్యా విధానంలో అనేక ఆధునిక మార్పులు జరిగాయన్నమాట నిజం. ఈ నాటి చైనా నాయకులందరూ అమెరికా, ఇంగ్లాండ్, ఫ్రాన్సు, జర్మనీ, తదితర విశ్వవిద్యాలయాల్లో చదువుకుని వచ్చినవారే. మేడమ్ చంగ్ కై షెక్ కూడా అమెరికా విశ్వవిద్యాలయంలోనే చదువుకుంది. కాని స్వదేశానికి ఆ విదేశీయుల సంస్కృతి యిమడదని వారు గ్రహించారు. బెర్ట్రండ్ రస్సెల్ ఎంతో సరసంగా చెప్పినట్లు—

"అమెరికన్ మతకర్తలు చైనా విద్యావ్యాప్తికి ఎంతో తోడ్పడినా, వారి కృషి ప్రశంసాపాత్రమైనా, విదేశీయులచే నడుపబడే విద్యావిధానం మాత్రం చైనా తత్వానికి పడదు."

ఇందువల్ల చైనా దేశస్థులచే నడుపబడే విద్యాసంస్థలకే నేటి చైనా ప్రభుత్వం చేయూత నిస్తోంది. ఈ విదేశ విద్యావిధాన బహిష్కరణలో ఉండే గుట్టు, ప్రపంచ ప్రఖ్యాత విద్యావేత్తయగు బెర్ట్రెండ్ రస్సెల్ వ్రాసిన "చైనా సమస్య" అనే ఉద్గ్రంథంలో బయటపెట్టాడు—

"ఏ దృక్పథంతో చూచినా చైనా సంస్కృతి, చైనా దేశస్థుల జాతీయ విద్యావిధానము, శ్వేతముఖుల సంస్కృతికన్నా చాలా గొప్పది. ఏ కొద్దిమంది ఐరోపియనులో ఈ సంగతి గ్రహించగలుగుతారు. కాని, అమెరికనులు మాత్రం, తమ మతప్రచారమనే ముసుగులో, తమ జాతియే గొప్పదనే దురహంకార తమస్సులో, చైనాజాతి సంస్కృతిలోని గొప్పదనాన్ని గ్రహించనేలేరు."

ఈ మాటలు బెర్ట్రెండ్ రస్సెల్ 1922లో వ్రాసినవి. కాని గత 20 సంవత్సరాలలో అమెరికన్ మిషనరీలలో ఎంతో మార్పువచ్చి, చైనా జాతీయ విద్యాసంస్కర్తలకు చేదోడు వాదోడుగా వుంటున్నారు. చైనా జాతీయజీవనానికి సరిపోయే జాతీయ విద్యావిధానం నెలకొల్పడమే ఆధునిక చైనా విద్యావిధాన ముఖ్య సమస్య. 'కుమిన్‌టాంగ్' పక్షం, చైనా ప్రజాప్రభుత్వంకూడా యిందుకే అత్యంతకృషి చేస్తున్నాయి. చైనా విద్యావిధానపు సర్వాధికారాలు జాతీయప్రభుత్వము చేతులలోనే వున్నాయి.

1931లో అంతర్జాతీయ సమితి యాజమాన్యం క్రింద నియమింపబడిన విద్యావేత్తల సంఘం చైనాకువచ్చి విద్యావిధాన పర్యాలోకన చేసేటప్పటికి ప్రాథమిక విద్య చాల తక్కువగాను, ఉన్నతవిద్యకు పునాదులు లేకుండాను, కళాశాల విద్య పనికిరానిదిగాను వుండేవి. ఈ సంఘ సలహాల ప్రకారం ప్రాథమిక విద్యావిధానం సంస్కరింపబడింది; ఉన్నత విద్యకు సుస్థిరత ఏర్పడింది; కళాశాలలు ఎక్కువ స్థాపించి విశ్వవిద్యాలయాలు తగ్గించారు. చైనాలో సుశిక్షణ పొందని విద్యార్థులు విదేశాలకు పోకూడదని చీనా ప్రభుత్వం శాసించింది.

అంతర్జాతీయ కార్మికోద్యమ కార్యాలయానికి అసిస్టెంటు డైరక్టరగు "యమ్. మారెట్" 1933లో చైనా వెళ్లేసరికే ఎంతో విద్యావ్యాప్తి

జరిగింది. 1931లో నూటికి 21 మంది ప్రాథమిక విద్య నభ్యసిస్తూంటే 1938 నాటికి నూటికి 32 మంది వరకు హెచ్చారు.

ఉన్నత పాఠశాలలు మూడువిధాలుగా ఉన్నాయి — వృత్తి విద్యలు, పారిశ్రామిక విద్య నేర్పేవి; ఉపాధ్యాయ పదవికి పనికివచ్చే విద్య గరపేవి; కళాశాల విద్య చదువుకోడానికి తాహతులేనివారికి లోకపరిజ్ఞానంలో గట్టిగా పునాదులు వేసేందుకు పాటుబడే సాధారణ ఉన్నత పాఠశాలలు. యమ్. మారెటి సలహా ప్రకారం చైనా వృత్తి విద్యాలయాలలో వ్యవసాయ శాస్త్ర సంబంధమైన పరిశోధనల కెక్కువ ప్రాముఖ్యత నిస్తున్నారు.

జపానుతో యుద్ధం రాకపోతే యీసరికే చైనా ప్రభుత్వం సార్వజనీన ప్రాథమిక విద్యావిధానం ఆచరణలో పెట్టేది. ఈ విద్యావిధానం ప్రవేశపెట్టడానికి అవకాశం లేకపోవడంవల్ల 'ప్రయోజన విద్య'కు చైనా ప్రభుత్వం ఎంతో ప్రాముఖ్యత చూపుతోంది. వయస్సువచ్చిన ప్రతిమనిషికి వార్తాపత్రికలు చదవడానికి, చిన్ని పుస్తకాలు గ్రహం చేసుకోడానికి, పౌరసహక్కులను, విధులను అవగతం చేసుకునేందుకు కావలసిన విద్య గరపడమే యీ ప్రయోజన విద్యావిధానోద్యమ ముఖ్యాశయం.

చైనా—జపానుల మధ్య జరుగుతూన్న ఘోర యుద్ధం ముగిస్తే, శాంతి చేకూరితే చైనా విద్యావిధానాన్ని సర్వాంగసుందరంగా చేయడానికి తగిన అవకాశాలున్నాయి.

## చైనా విద్యార్థి ఉద్యమం

ఒకవైపున జపాన్‌తో ఘోర యుద్ధం సాగిస్తున్నా, విద్యాసంస్థలపై బాంబుల వర్షం కురుస్తున్నా, విశ్వవిద్యాలయాలు పనిచేస్తూనే వున్నాయి. పదివేలమంది చైనా ప్రజలో మహావెళ్ళితే ఒక్కడు వెళ్ళుతాడు కళాశాల చదువువరకు. పట్టభద్రతవరకు వచ్చిన విద్యార్థులు బహుకొద్ది యగుటచే, చైనా భావి నాయకులకు నిలయమైన విశ్వవిద్యాలయాలకుండే విలువ గ్రహించి, కళాశాల విద్యార్థులు గాని, పట్టభద్రులు గాని సైన్యంలో చేర రాదనియు, విద్యావిధానాన్ని నిరంతరాయంగా సాగించాలనీ జనరల్ చంగ్

కై షేక్ హెచ్చరించాడు. కానీ, జపానువారు కోస్తా పట్టణాలలోని విశ్వవిద్యాలయాలమీదే మొట్టమొదట్లో అగ్నివర్షం కురిపించారు. చైనాలోని 108 కళాశాలలలోను, 75 కళాశాలలు జపాను విమానదాడులవల్ల మూసివేయక తప్పింది కాదు. ఈ కోస్తా పట్టణాల్లోని విద్యాసంస్థలన్నిటిని చుంకింగ్ సమీపంలోని ఆటవిక ప్రదేశాలకి, ఉపాధ్యాయులు, విద్యార్థులు కలిసి ధైర్య సాహసాలతో తమ భుజస్కంధాల మీద మోసుకుపోవడం నిజంగా గొప్ప చిత్రసంఘటన నే చెప్పాలి. 1500 మైళ్ళ దూరం దారీడొంక లేని ఎడారులలో నెలల తరబడి నడిచి, మలేరియా జ్వరాలకు గురియగుచు చైనా విద్యార్థులు తమ సహజ జ్ఞాన పిపాసను నిరూపిస్తున్నారు. శాస్త్ర కళాశాలలన్నీ బాంబుల పొగతో నిండిపోయి, విద్యార్థులా పొగలోంచి బయట పడడమే కష్టంగా ఉంటే, వెనుకనుండి ఒక ఆచార్యుడు "రేపు మామూలుగానే క్లాసులుంటాయి" అని కేకవేశేవాడు. దీన్నిబట్టి నేటి చైనా యుద్ధ వాతావరణంలో కూడా ప్రభుత్వం విద్యావ్యాప్తికి పాటుపడుతోందని తెలుసుకోవచ్చును.

చైనా విద్యార్థి ఉద్యమం ప్రజాజీవనాని కొక పట్టుగొమ్మ. నేటి చైనా విద్యార్థిలో దేశసేవ చేయాలనే సంకల్పం స్థిరపడిపోయింది. తుపాకీమందు మొదట్లో కనిపెట్టింది చైనాలో ననీ, శాస్త్రపరిశోధనవల్ల దేశ రక్షణకు తోడ్పడే క్రొత్త ఆయుధాలను ఉత్పత్తి చేయాలనునే ధీమా నేటి చైనా విద్యార్థులలో ప్రతిబింబిస్తూంది—

"చీనా విద్యార్థి ఉద్యమం ఆ దేశపు పురోభివృద్ధికి మిక్కిలి సహాయపడుతోంది. వర్సెల్సు సంధి జరుగుతూన్న సమయంలో చైనా పరదేశాలకు బానిసగాకుండా ఆత్మగౌరవాన్ని నిలబెట్టింది విద్యార్థులేను. వారి ఉద్యమమే చివరకు 1926లో జాతీయప్రభుత్వ స్థాపనకు దారి తీసింది. ఆ ఉద్యమమే లేకుంటే చైనాదేశపు చరిత్ర వేరొక రీతిగా వుండేది. యుద్ధపు ఒత్తిడి సమయంలోకూడా విద్యాసంస్థలను నిరాటంకంగా కొనసాగిస్తూండడం చీనా దేశంలో నేడు ప్రధాన రాజనీతి"

అని శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయగారు ఇటీవల ఉపన్యసిస్తూ అన్నారు.

పర్సేల్లుస్ సంధి సందర్భంలో షాంటుంగ్ ద్వీపకల్పం జపాన్‌కు యివ్వ నిర్ణయించడం మిక్కిలి అన్యాయమగు పరతనీ పోట్లాడి, నెగ్గింది విశ్వవిద్యాలయ విద్యార్థులేను. ఈ సందర్భంలో విద్యార్థులు చేసిన అత్యంత కృషిని 'ట్యూ' వ్రాసిన "జాగృతి పొందిన చైనా" అనే ఉత్తమ గ్రంథంలో యిలా ప్రశంసించాడు:—

"పర్సేల్లుస్ సంధి పత్రానికి సంతకం పెట్టడం అన్యాయమని దేశమందంతటా ప్రచారంచేసి, దేశాన్ని మేలుకొలిపి తుదకు ఆ సంధి జరగకుండా చేసింది విద్యార్థులు. జపాను వస్తుబహిష్కారణకు ఎంతో ప్రచారం చేశారు విద్యార్థులు. ఉత్తమ గ్రంథాలను ప్రచురిస్తూ, ప్రజా హృదయాన్ని చూరగొనే ఉపన్యాసాలిస్తూ, ఉచిత పాఠశాలలను స్థాపిస్తూ విద్యార్థులు తిమతోడి ప్రజను అజ్ఞానాంధకారంనుండి లేవనెత్తి, జ్ఞానజ్యోతి నందిచ్చారు. ఉచిత పాఠశాలలలోను, రాత్రి పాఠశాలల లోను విద్యార్థులే విద్య గరపుదురు. ఒక్క పెకింగ్ నగరంలోనే విద్యార్థులు నడిపే పాఠశాలలలో 50,000 మంది పిల్లలు చదువుతుంటున్నా రంటే విద్యావ్యాప్తికోసం చైనా విద్యార్థులు చేస్తూన్న కృషి విశద మవుతుంది."

ప్రస్తుత యుద్ధావసరాలకు కావలసిన విమానదాడి రక్షణ స్థానాలను, మరతుపాకులుంచే స్థానాలను కట్టడం నేర్చుకుంటున్నారు నేటి చైనా ఇంజనీరింగు విద్యార్థులు. శస్త్రచికిత్స, ప్రథమచికిత్స మొదలగువాట్లలో ప్రత్యేక ప్రావీణ్యాన్ని పొందుతున్నారు వైద్య విద్యార్థులు. ఈ విధంగా వివిధ శాస్త్రాలలో తర్ఫీదుపొంది, సైన్య, వైద్యశాఖలలో జేరి దేశ సేవ చేస్తున్నారు నేటి చైనా విద్యార్థులు. ఈ యుద్ధపు రోజుల్లో కూడా సారస్వతం, తత్వశాస్త్రం, అర్థశాస్త్రం మొదలగువాటికి కూడా ప్రాధాన్యత యిస్తోంది చీనా ప్రభుత్వం. చైనా విద్యార్థి యీ విధంగా స్వాతంత్ర్య సమరంలో ఎంతో సహాయపడుతున్నాడు.

# 6. స్త్రీల సర్వతోముఖాభివృద్ధి

పదిహేను సంవత్సరాలక్రితం బానిసత్వంలో క్రుంగిపోతూ ఎంతో దీన స్థితిలోనున్న చైనా స్త్రీ యీనాడు స్వదేశ సంరక్షణకోసం తన సర్వశక్తుల్ని వినియోగించి ఘోరయుద్ధాలు చేస్తూంది. ఇంత క్షణికమైన మార్పు రావడానికి తగిన వాతావరణము, పరిస్థితులు ఉండితీరాలి. ఆ పరిస్థితు లేమిటి?

పూర్వపు చైనా సంఘంలో స్త్రీ యొక బానిస. ఆమెను తృణప్రాయంగా చూచేవారు. కొంతకాలంక్రితం చైనా కుటుంబ జీవితాన్ని గురించి వ్రాసిన వ్రాతలనుబట్టి చూస్తే చైనా కుటుంబ మొక చిన్న స్వదేశ సంస్థానంలాంటిదనియు, కుటుంబపు పెద్ద దానికి రాజనియు, కుటుంబ సభ్యులందరి ప్రజలనియు తేలుతుంది. చైనా కుటుంబం పూర్వ మొక యంత్రంలాగా ఉండేది. అందులో ప్రేమకు స్థానమే లేదు. కుటుంబ సభ్యులా యంత్రానికి చీలలవంటివారు. పూర్వాచారాలు, మూఢ నమ్మకాలు, సాంఘిక దురాచారాలు, పిచ్చి నమ్మకాలు చైనా స్త్రీని మరింత అధోగతి పాలుచేశాయి.

చైనా స్త్రీ పూర్వ మింత అధోగతిలో నున్నప్పటికి ఆమె హృదయాంతర్గతమైన సుశీలత, పరిణతి, వ్యవహార నైపుణ్యత, ధీరత, వీరత్వములను చాటుఘట్టములెన్నో చైనా చరిత్రలో సువర్ణాక్షరాల లిఖింపబడి ఉన్నాయి. ఈ గుణాలన్నీ ఆమెకు చైనా ప్రాచీన ప్రాచ్యసంస్కృతియే నేర్పినది. ఆనాటి చీనా స్త్రీకి సంఘంలో సరియైన స్థానం యివ్వకపోవడంవల్ల ఆమె లోని శక్తియుక్తులు, ప్రతిభ నివురుగప్పిన నిప్పులాగా ఉండక తప్పింది కాదు.

కాని నేటి చైనా సంఘజీవనంలో అనేక మార్పులు గలిగాయి. జాతీయ ప్రబోధం, స్వాతంత్ర్య సమరం, చైనా విప్లవం, చలన చిత్రాలు, పాశ్చాత్య పరిచయం—ఇవి చైనా స్త్రీలో చైతన్యం గలిగించాయి. ఆమె ఇప్పుడు స్త్రీ స్వాతంత్ర్యంకోసం, వ్యక్తిత్వంకోసం పోట్లాడుతోంది.

మంచూ వంశాధికార నిర్మూలానికి డాక్టరు సన్ యట్ సెన్ 1911లో నడిపిన విప్లవానికి స్త్రీ లెంతమందో ప్రశంసాపాత్రమైన సహాయం చేశారు.

1912లో ప్రజాప్రభుత్వం స్థాపింపబడినప్పటికీ కొంతకాలంవరకు అధికారం మాత్రం ధనాఢ్యుల చేతులలో ఉండడంవల్ల "కుమిన్‌టాంగ్" పక్ష స్త్రీ సభ్యురాండ్రు, స్త్రీపురుష సమత్వం కల్పించే కొన్ని శాసనాలు ప్రభుత్వం చేయాలని ప్రజాశాసనసభలో ప్రవేశపెట్టిన ప్రతిపాదన ఓడిపోక తప్పిందికాదు.

1925–26 సంవత్సరాలలో అంతఃకలహాలను అణచి దేశైక్యతకు జరిగిన విశ్వ ప్రయత్నాలలో వేలకువేలు చైనా యువతీమణులు ధైర్యంగా పాల్గొన్నారు. 1924 లో మొట్టమొదటి జాతీయ మహాసభ 'కాంటన్' నగరంలో సమావేశమైనప్పుడు యిద్దరు స్త్రీలుకూడా 'కుమిన్‌టాంగ్' పక్ష కార్యవర్గానికి ఎన్నుకోబడ్డారు. ఒకావిడ కుమిన్‌టాంగ్ పక్ష స్త్రీ శాఖ స్థాపకురాలు. రెండో ఆవిడ కమ్యూనిస్టుపక్ష నాయకురాలు.

'కుమిన్‌టాంగ్' పక్ష స్త్రీ శాఖ స్థాపింపబడి స్త్రీ జనాభ్యుదయానికి కొంత కృషి సలిపినప్పటికి ధనాఢ్యులగు మిలటరీ సభ్యులు స్త్రీల గతియే గుర్తించక స్త్రీ శాఖనే ఎత్తివేశారు. కుమిన్‌టాంగ్ పక్షంలో సభ్యురాండ్రుగానున్న కొద్ది స్త్రీలు వారి చనిపోయిన భర్తల కుండే పేరునుబట్టి మాత్రమే ఉన్నారు కాని చైనా స్త్రీలకు ప్రతినిధులుగా పనిచేయడానికి సావకాశాలు లేకపోయినాయి. అంతఃకలహాలతోను, స్త్రీ స్వాతంత్ర్య నిర్మూలనంతోను, పైబడవచ్చు జపానును శాంతింపజేయడంతోనూ 1925 నుండి పది సంవత్సరాలబాటు చైనా రాజకీయా లెంతో నిరాశాజనకంగా వుండి, అరాచకాని కొక మెట్టు తక్కువగా ఉన్నాయంటే అతిశయోక్తి కాదు.

1931 లో జపాను మంచూరియాను ఆక్రమించుకుని, 1933 లో 'మంచూకో' అనే మిథ్య స్వాతంత్ర్య రాష్ట్రాన్ని స్థాపించడం, చైనా ప్రభుత్వం జపానును ప్రతిఘటించడంలో తాచివేతచేయడం, షాంగ్‌హై, సింగ్‌టో నగరాలలోని బట్టల మిల్లుల కూలీల సమ్మె రావడం, ఈ సమ్మెదారులకు సలహా నివ్వడాని కేర్పడ్డ ఏడుగురిని ప్రభుత్వం నిర్బంధించడం — ఇవన్నీ చైనా ప్రజలలో ఉద్రేకం పుట్టించి స్వాతంత్ర్య సమరానికి, జపాను

దురాక్రమణ ప్రతిఘటనకు దారితీశాయి. దేశమంతటా జాతీయమోక్ష సాధనోద్యమం వ్యాపించింది. చైనాలో సగానికి సగం స్త్రీలవడంవల్ల బానిసలైన స్త్రీజాతి కీతరుణంలోనే జాగృతి కలిగింది. బండ చాకిరీచేసి నిర్జీవమైన 'చైనా స్త్రీ బానిసకు' మానవత్వమను ఆశాజ్యోతి నార్పివేసి, యుగయుగాల వరకు పురుషునకు బానిసలుగా ఉంచుకుందామనే చైనా జమీందారుల ముష్కర చర్యల కంత్యకాలం వచ్చింది. ఈ స్త్రీ స్వాతంత్ర్య సమరంలో ఎంతోమంది చైనా యువతీమణుల వేడిరక్తం కాల్వలు కట్టి ప్రవహించినవా రోజులలో. నేటి జపాను యుద్ధం నిద్రావస్థలోనున్న చైనా స్త్రీ లోకాని కొక మేలు కొలుపయిందనాలి. చైనా స్త్రీ నేడు ప్రవేశింపని జీవితరంగం లేదు. ఆమె సిపాయి, వైమానికురాలు, టాంక్ డ్రైవరు, టెక్నిషియన్, వార్తాహరి, రక్షకభటురాలు, వైద్యురాలు, దాది—అంటే దేశ సేవకోసం ఎంత సాహసానికైనా వెనుదీయడం లేదన్నమాట. అవసరమైతే యుద్ధరంగంలో పోట్లాడడమే గాక, యుద్ధరంగం వెనుకనుండి యోధులకు కావలసిన దుస్తులు కుట్టడం, వంట చేయడం, స్వాతంత్ర్య గీతాలను దేశమందంతటా ప్రచారం చేయడం మొదలగు పనులు చేస్తున్నారు నేటి చైనా స్త్రీలు.

నేటి చైనా స్త్రీలోని ఓర్పు, సాహసం, చాతుర్యం చైనాజాతి కొక పెట్టని కోట. శత్రువులకు వెన్నిచ్చి పారిపోయే పురుషులకు వీరావేశం కలిగించి మరల యుద్ధరంగానికి పంపుతున్నారు నేటిచైనా స్త్రీలు. అయిదారు వేలమంది స్త్రీలు యుద్ధరంగంలో పురుషుల ప్రక్కన పోరాడుతున్నారీనాటి చైనాలో.

చైనాస్త్రీ లోకంలో నేడిట్టి చైతన్యం కలగడానికి, నవీనాశయాలు విరివిగా ప్రచారం కావడానికీ ముఖ్య కారకురాండ్రగు సూంగ్ సోదరీత్రయాన్ని స్మరించకుంటే చైనా మహిళోద్యమ ఉత్తమ శిఖరాలను మరచిపోయినవాళ్లమవుతాము. వీరు ముగ్గురు చైనా రాజకీయవేత్తలను వివాహమాడి తద్వారా చైనాస్త్రీల సర్వతోముఖాభివృద్ధికి అత్యంత కృషి సలుపుతున్నారు.

సూంగ్ సోదరీత్రయంలో జ్యేష్ఠురాలు చైనాకు ఆర్థికమంత్రి, కోటీశ్వరుడునగు హెచ్. హెచ్. కంగ్ యొక్క సతీమణి. ఈమె మిక్కిలి వ్యవహారజ్ఞానం గలిగి, అధికార వాంఛ, పట్టుదలతో పనిచేస్తుంది. ఆర్థిక వ్యవహారాలన్నీ ఆమెకు కరతలామలకం. సూంగ్ కుటుంబ భాగ్యానికి ఆమె ఆర్థిక విషయ పరిజ్ఞానమే ముఖ్యకారణం. ఆమె రాజకీయాల జోలి కెక్కువ పోదు. రెండవసోదరి చైనా ప్రజాస్వామ్య స్థాపకుడగు డాక్టరు సన్‌యట్ సెన్ అర్ధాంగి. అంతర్యుద్ధాలతో నిండి, నిద్రావస్థలోనున్న చైనాలో, డాక్టరు సన్ విప్లవ కారకుడుగాను, ప్రవాసుడుగాను పడిన అష్టకష్టాలలో భాగస్వామినియైన సుశీల. డాక్టరు సన్‌యట్ సెన్ చనిపోయిన తరువాత గూడ ఆయన ఆశయాలను ప్రచారం చేయడానికి పట్టుదలతో పాటుబడిన దామె. కమ్యూనిస్టు నాయకుల సహాయంతో తన భర్త మనోరథం సఫలీకృతం చేయడానికి ప్రయత్నించింది.

వీరిలో కడసారపు సోదరి చైనా ప్రజాస్వామ్య సంరక్షణకు సర్వదా కృషి సలిపే జనరలిస్సో చంగ్ కై షెక్ కు భార్యా రత్నం. చైనా జాతీయోద్యమానికి, స్త్రీ జనాభ్యుదయానికి అమూల్యమగు కృషి చేస్తూంది. 1939లో "చైనాజాతీయ సంరక్షణ సంఘం" అనే ఒక మహిళా సంఘాన్ని స్థాపించింది. లక్షలకొలది స్త్రీలు యీ సంఘంలో సభ్యులుగాజేరి జపాను దురాక్రమణనాప సంసిద్ధులయ్యారు. స్త్రీ విద్యా వ్యాప్తికోసం ఆమె అనేక విద్యాలయాలను స్థాపించింది. ఈమె నడుపుతూన్న నవజీవనోద్యమంవల్ల చైనా స్త్రీలలో నవజీవనోద్దీపనం జరుగుతోంది. చైనా ప్రాచీన సంస్కృతిలో ఉత్తమమైన వాటిని, ఆధునిక విజ్ఞానంలో ఉత్తమమైన వాటిని సమ్మేళనం చేసి ఒక ఆదర్శ సంస్కృతి ఆచరణలోకి తేద్దామనే ఆశయంతో చంగ్ కై షెక్ సతీమణి తీవ్ర కృషి చేస్తూంది. ప్రపంచంలో ఇంతవరకు ఎన్నడూ స్త్రీ ఆక్రమించని వైమానికశాఖ ఉపమంత్రి పదవిని ఆమె నిర్వహించింది. యుద్ధార్తులకు, అనాథ బాలికలకు, క్షతగాత్రులైన సైనికులకు సేవజేసే సంస్థల నిర్వహణలో ఆమె యిప్పుడు నిమగ్నురాలయి వుంది.

వైద్యాలయాలకు వెళ్లినప్పుడు ఆమె స్వహస్తాలతో సైనికుల గాయాలకు కట్లు కడుతుంది. ఇట్టి ఆదర్శ నారీమణి నాయకత్వంక్రింద చైనా స్త్రీలు స్వాతంత్ర్య సమరాన్ని సాగిస్తూన్నారు. కాబట్టే వారిలో సర్వతోముఖ వికాసం గలిగింది.

మొట్టమొదటి గోరిల్లా దళాన్ని స్థాపించింది ఒక స్త్రీయేను. ఆమె పేరు శ్రీమతి చో. ఈమె మంచూకోలో ఒక గ్రామ నివాసి. ఈమెను "మమామస్కీవ్వటో" అని కూడా పిలుస్తూంటూరు. ఈ వృద్ధ నారీమణి, జపానువారు చైనాప్రజను పెడుతూన్న క్రూర హింసలనుచూచి సహించలేక శత్రువును స్వదేశాన్నుండి పారద్రోలాలనే వజ్ర సంకల్పంతో గోరిల్లా యుద్ధ పద్ధతిని ప్రారంభించింది. చైనా–జపానుకు జరుగుతూన్న ఘోర యుద్ధాలలో ఈ గోరిల్లా యుద్ధానికి ఎక్కువ ప్రాముఖ్యత ఉంది. శ్రీమతి చో ఎక్కువ చదువుకున్నది కాకపోయినా, ఆమెలోని దేశప్రేమ, కార్యదీక్ష పెనగొని, రగిలి, వేలకోలది; యువతీ, యువకుల్ని ఉత్సాహపరచినాయి. గోరిల్లా యుద్ధాలలో చాలమందిని తరిఫీదుచేసి, జపానువారితో భీషణ యుద్ధాలు సాగిస్తూ ఈ వీరనారీమణి యిటీవలనే వీరస్వర్గ మలంకరించింది.

చైనాలో వివిధపక్ష ప్రతినిధులున్న "జాతీయ ప్రజాప్రతినిధి సభ"లో పదిమంది స్త్రీ సభ్యురాండ్రున్నారంటే నేటిచైనా స్త్రీకున్న పౌరసహక్కులు విశదమవుతాయి. పురుషుని కెన్ని హక్కులూ, బాధ్యతలూ ఉన్నాయో అన్నీ స్త్రీల కున్నాయి నేటిచైనాలో.

---

# 7. పరిశ్రమలు - సహకారోద్యమం

చైనాకూడ భారతదేశంవలెనే వ్యవసాయక దేశమనీ, నూటికి యనభైమందికి వ్యవసాయమే ముఖ్యజీవనోపాయమని చెప్పాము. కాని చైనా ఆర్థికాభివృద్ధికి పారిశ్రామిక విస్తరణ అవసరమని చైనా ప్రభుత్వం గ్రహించింది. రైతుకు వ్యవసాయంవల్ల వచ్చే రాబడి చాల తక్కువవడంవల్ల అతనికొక ఉపవృత్తి ఉండటం అవసరం. చైనాకున్న అపార ఖనిజసంపద చైనా పారిశ్రామికాభివృద్ధికెంతో తోడ్పడుతోంది. చైనా భూగర్భంలో ఖనిజసంపద ఉన్నా, పెట్టుబడిపెట్టి అది త్రవ్వే నాథుడు లేకపోయా డింతవరకు. కాని చైనా-జపాను మధ్య జరుగుతూన్న యుద్ధంవల్ల యంత్రాలయాలన్నీ దేశమధ్య ప్రదేశాలకు పోవడంచేత, వాటికి కావలసిన ఖనిజసంపద త్రవ్వక తప్పిందికాదు. కోస్తా పట్టణాల్లోనే పరిశ్రమలన్నీ క్రిక్కిర్సేటట్టు కేంద్రీకరించడంవల్ల కలిగిన నష్టాలన్నీ తెలిసిన చైనా ప్రభుత్వం, నేడు పరిశ్రమలను దేశమధ్యంలో స్థాపిస్తోంది.

చైనాలో వ్యవసాయం ముఖ్య పరిశ్రమ కాబట్టి, దాని సక్రమాభివృద్ధికి పరపతి అవసరం. కర్షకుని కాయకష్టం కూడూ-గుడ్డకే సరిపోని చైనావంటి దేశంలో యీ పరపతియొక్క ఆవశ్యకత మరీ ప్రాముఖ్యమైంది. తక్కువ వడ్డీలమీద విరివిగా పరపతి పుడితేనేగాని కర్షకుడు భూమిమీద కొంత పెట్టుబడి పెట్టి మరమ్మతుజేసి లాభదాయకంగా సేద్యం చేయలేడు. ప్రజోపయోగంకోసం విరివిగా పరపతి సంఘాలను స్థాపించడానికి చైనా ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. 1933లో చైనాలో 5 వేల పరపతి సంఘాలు మాత్రం వుండేవి. కాని 1936 నాటికి 15 వేలకు పెరిగాయి. ఇంత కొద్దికాలంలోనే చైనా పరపతి సంఘాభివృద్ధిని చూచి విదేశీయులుకూడా విస్తుపోయినారు. అత్యధిక వడ్డీలతో కార్మిక, కర్షకులను పీల్చి పిప్పిచేసే సాహుకారుల బారినుండి వారిని కాపాడడమే యీ పరపతి సంఘాల ముఖ్యోద్దేశం. కాని, ఈ పరపతి సంఘాల యాజమాన్యంలోకూడా ధనాఢ్యులుచేరి సహకారోద్యమ ఆశయాలను భగ్నంచేస్తున్నారు. ఈ విషయంలో చైనా ప్రభుత్వం తగిన

శ్రద్ధ తీసుకోకపోతే సహకారోద్యమంవల్ల కార్మిక, కర్షకాభ్యుదయం కలగదు. వ్యవసాయ ఫలసాయకాభివృద్ధికి ఆధునిక వ్యవసాయ పరికరాలు, నూత్న శాస్త్ర పరిశోధనలు అవసరమని చైనా ప్రభుత్వం తెలుసుకుని పరపతి సంఘాలు అందుకోసం స్థాపిస్తోంది.

సహకార సూత్రాలు చైనా కీనాటివి కావు. ఇరవై సంవత్సరాలకు పూర్వమే చైనా అంతర్జాతీయ క్షామనివారణ సంఘం ఏర్పడి వ్యవసాయాభివృద్ధికరమైన పనులకు స్వల్ప వడ్డీలమీద అప్పు లిచ్చేది. 1932 నుండి కేంద్ర ప్రభుత్వం గ్రామీణ సహకార పరపతి సంఘాభివృద్ధికి తీవ్ర కృషి చేస్తూంది.

1938 జూలైలో జాతీయప్రభుత్వం సహకారోద్యమానికి రూ. 50,00,000 పెట్టుబడి పెట్టింది. ఈ పెట్టుబడితో 1940 ఏప్రిల్ నాటికి 1500 ఉత్పత్తి సహకార సంఘాలను స్థాపించారు. 16 రాష్ట్రాలలో 69 కేంద్ర సరఫరా డిపోలను స్థాపించారు. సహకార సంఘా లన్నింటికీ ఒక కేంద్ర కార్యాలయం "చుంకింగ్"లో వుంది. పారిశ్రామిక సహకారోద్యమంలో సుమారు 700 మంది ప్రభుత్వోద్యోగులు పనిచేస్తున్నారు. 1940 నాటికి యీ సహకార సంఘాలలో 25 వేలమంది సభ్యులున్నారు. నెలకు రూ. 6,00,000 విలువగల వ్యాపారం చేస్తున్నాయి యీ సహకార సంఘాలు. నూరు రకాల వృత్తులు నెలకొల్పి 250 రకాల వస్తువులు తయారుచేస్తున్నారు చైనాలో యీ సంఘాల సహాయంతో. చెప్పుల జోళ్లు, మొదలు పెద్దపెద్ద నావలువరకు తయారుచేస్తూన్నా రీనాడు చైనాలో సహకార పద్ధతులతో. చైనా యుద్ధావసర ఆర్థికాభివృద్ధిలో పారిశ్రామిక సహకారోద్యమం ఎంతో ప్రశంసనీయమైంది.

జపాను దురాక్రమణవల్ల కోస్తా ప్రాంతాలలోని పరిశ్రమలన్నీ శత్రుహస్తగతమయి, దిగుమతులు యుద్ధంవల్ల సన్నగిల్లి, నిరుద్యోగం ప్రబలి, ఆకలి బాధ ఎక్కువయి చైనా ప్రజ అల్లకల్లోల మవుతుందా అనే క్లిష్ట పరిస్థితులలో యీ పారిశ్రామిక సహకారసంఘాలు పుట్టాయి. "చుంకింగ్"లో కేంద్ర కార్యాలయం; పోచి (షెన్ షీ); చంగ్టు (స్యూకాన్); కున్ మింగ్

(యునాన్); కియాన్ (కియాంగ్ సి); పోచింగ్ (హునాన్) — యీ అయిదు రాష్ట్రాలలోను అయిదు స్థానిక కార్యాలయాలను నెలకొల్పి యీ పారిశ్రామిక సహకార సంఘాలు చైనా పారిశ్రామికాభివృద్ధి కమోఘ కృషి చేస్తున్నాయి. ఈ 5 స్థానిక కార్యాలయాలనుండి అనేక ఉపశాఖలు స్థాపించి ప్రజలలో ప్రబోధం చేస్తున్నారు. 2 వేల సహకార సమ్మేళనా లున్నాయి. ఇవి నెలకు రూ. 4,50,00,000 డాలర్ల విలువగల వస్తూత్పత్తి చేస్తున్నాయి. బొగ్గు, నూలు బట్టలు, మెరుగు కాగితం, బ్యాటరీ లైట్లు, పనిముట్లు—అంటే అన్ని రకాల సామగ్రి సహకారసంఘాల సహాయంతో తయారుచేస్తున్నారు చైనాలో.

సహకారోద్యమ సూత్రాలలో సుశిక్షణ నివ్వడానికి "చెంగ్టు"లో ఒక శిక్షణ కేంద్రం ఉంది. కళాశాల విద్యార్థులు ఈ శిక్షణ పొందడంలో అత్యధిక శ్రద్ధ వహిస్తున్నారు. ఏటేటా నూరుమంది విద్యార్థులకు శిక్షణ నిస్తున్నారు. శిక్షణ కేంద్రానికి తోడు ఒక పరిశోధనాలయం, ఇంజనీరింగ్ ప్రాథశాలకూడా నిర్మించారు.

చైనా పారిశ్రామిక సహకారోద్యమం దేశీయ పరిశ్రమలను పునర్విభక్త జేయడానికి ఉపకరించడమేగాక, ఆ ఉద్యమ స్థాపకులుగూడ మొట్టమొదట్లో ఊహించని ఎన్నో సంఘ సంస్కరణల కుపకరిస్తోంది. ఆరితేరిన కార్మికులను తరిఫీదు చేయడంలోనూ, పారిశ్రామిక సహకారోద్యమంలో పని చేసే ప్రతివారూ అక్షరాస్యులవ్వాలనే నియమంవల్ల జనసామాన్యంయొక్క విజ్ఞాన చక్షువులను వికసింపచేయడంలోనూ, నిరుద్యోగతను నిర్మూలించడంలోనూ, పారిశ్రామిక సహకారోద్యమం ఎంతో తోడ్పడుతోంది. చైనా ఆర్థికజీవన సర్వతోముఖ వికాసానికీఉద్యమం పట్టుగొమ్మ.

## చైనా యుద్ధ పరిశ్రమలు

చైనా జపాను యుద్ధం ప్రారంభమయి అప్పుడే ఆరు సంవత్సరాలు గడిచాయి. గత అయిదు సంవత్సరాలలోనూ చైనా ఆర్థికజీవనంలో అనేక మార్పులు జరిగాయి. యుద్ధానికి పూర్వం చైనాలో భారీ పరిశ్రమలచే

వుండేవి కావు. ప్రభుత్వ సహాయంతో నేటి చైనా ప్రజ శత్రుబారినుండి తమదేశాన్ని సంరక్షించుకునేందుకు కావలసిన భారీ పరిశ్రమలను స్థాపిస్తున్నారు. అంతర్జాతీయ మారకపు రేట్లు, రాకపోకల సౌకర్యాలు తారుమారయినా, ప్రభుత్వం భారీ పరిశ్రమలయెడ చూపే సానుభూతి, సహాయంవల్ల ఆర్థికంగా ఎంతో వెనుకబడియుండే దేశ మధ్య రాష్ట్రాలలోగూడా పరిశ్రమలు పెరుగుతున్నాయి.

యుద్ధారంభానికి పూర్వం చైనా పరిశ్రమలన్నీ కోస్తా ప్రాంతాలలో కేంద్రీకరించబడినాయి. కాని యుద్ధంవల్ల పరిశ్రమలన్నీ దేశమధ్యానికి తర్లించుకుపోక తప్పింది కాదు. జపానుబారినుండి తప్పించుకోవాలంటే, భారీ పరిశ్రమను తర్లించుకుపోడం అవసరమైనా, బ్రహ్మప్రళయమైనా, అష్టకష్టాలకోర్చి చైనా ప్రభుత్వం 1937 నవంబరునుండి పరిశ్రమలను దేశమధ్య ప్రదేశాలలోనడుపుతోంది. ముఖ్యంగా విద్యుచ్ఛక్తి సరఫరా యంత్రాలు, బొగ్గు గనులను త్రవ్వే సామగ్రి, రసాయనిక పదార్థాల కార్ఖానాలు, నేతయంత్రాలు, పిండి మరలు, తదితర యుద్ధావసర పరిశ్రమలను కాపాడింది ప్రభుత్వం. 1940 వ సంవత్సరాంతానికి 450 రకాల పరిశ్రమలను ప్రభుత్వం కోస్తా ప్రాంతాలనుండి దేశమధ్యానికి మార్చి శత్రుబారినుండి రక్షించుకుంది. 1,20,000 టన్నుల యంత్రాలను యుద్ధరంగంనుండి యివతలికి తీసుకురాగలిగారు. 181 యంత్రి కార్ఖానాలు, 29 విద్యుచ్ఛక్తి యంత్రాలయాలు, 56 రసాయనిక కార్ఖానాలు, 22 ఆహార సరఫరా యంత్రాలు, 15 గాజు, జాడీ యంత్రాలయాలు, 2 ఇనుప యంత్రాగారాలు దేశమధ్యానికి తర్లించుకుని పోబడినాయి.

ఉత్తర చైనా, పడమటి చైనా ప్రాంతాలలో జలాంతర్గత విద్యుచ్ఛక్తినుత్పత్తిచేసే సదుపాయా లెక్కువ వుండడంచేత ఆ ప్రదేశాలలో పరిశోధనలు చేస్తున్నారు. నాలుగు కేంద్రాలలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తిచేస్తున్నారు. 20,000 కిలోవాట్ల ప్రమాణంగల గొప్ప యంత్రాలనుకూడా స్థాపిస్తున్నారు. ప్రభుత్వం స్థాపించిన కేంద్ర విద్యుచ్ఛక్తి కార్ఖానాలో నాలుగు

యంత్రాలున్నాయి. రాగి, ఇనుపతీగె, విద్యుచ్ఛక్తి బల్బులు, రేడియో ట్యూబులు, విద్యుచ్ఛక్తి యంత్రాలు, బ్యాటరీలు మొదలగు వస్తువులను తయారుచేస్తున్నారీనాడు కేంద్ర కార్ఖానాలో. 15 విద్యుచ్ఛక్తి సరఫరా కేంద్రాలను నిర్మించి పారిశ్రామికాభివృద్ధికోసం విరివిగా విద్యుచ్ఛక్తిని పల్లెలకు పంచిపెడుతోంది ప్రభుత్వం.

రైళ్ళకు, ఓడలకు, కార్ఖానాలకు, జనసామాన్యానికి నిత్యకృత్యాలకి ఎంతో బొగ్గు కావాలి. కాబట్టి క్రొత్త బొగ్గుగనులను త్రవ్వుతున్నారు. చైనాలో ఉన్న బొగ్గుగనులలో నూతన పద్ధతులను ప్రవేశపెట్టి ఉత్పత్తి ఎక్కువ చేస్తున్నారు. 1927 లో 36,88,000 టన్నుల బొగ్గు మాత్రమే ఉత్పత్తి చేస్తున్న దేశ మధ్యప్రాంతాలీనాడు 57,16,000 టన్నుల బొగ్గు త్రవ్వుతున్నాయి సంవత్సరానికి.

పారిశ్రామికాభివృద్ధి కావాలంటే యంత్రాలుండాలి. యంత్రాలను తయారు చేయడానికి కార్ఖానా లుండాలి; మెకానిక్కు లుండాలి. ఇందుకు చైనాప్రభుత్వం కేంద్రకార్ఖానా నొకదానిని నిర్మించి విద్యుచ్ఛక్తి యంత్రాలు, బాయిలర్లు, నేతయంత్రాలు, ఆవిరియంత్రాలు, తయారుచేస్తోంది. మోటారు పరిశ్రమకూడా నెలకొల్పారీ కార్ఖానాలోనే. ఈ కార్ఖానా దేశరక్షణ సామగ్రిని తయారుచేయడానికీ, యంత్రోత్పత్తికీ బాగా వుపయోగిస్తోంది. కాగితపు యంత్రాలు, బట్టలను వుత్పత్తిచేసే మరలుకూడా చైనాలోనే చేస్తున్నారు. యంత్రోత్పత్తికి కావలసిన సామగ్రి అంతా చైనాకుండడంవల్ల చైనాలో యింకా యంత్రాగారాలు స్థాపించడానికి వీల్లున్నాయి.

యుద్ధసామగ్రికి, యంత్రాలకి ఉక్కు అవసరం. ఒక్క కేంద్రంలోనే 15 పెద్ద కొలిములు పనిచేస్తున్నాయి ఉక్కు నుత్పత్తి చేయడానికి. ఒక్క రాష్ట్రంలోనే విద్యుచ్ఛక్తివల్ల నడుపబడే నాలుగు కొలిములు పనిచేస్తూ రోజుకు 5 టన్నుల ఉక్కును ఉత్పత్తి చేస్తున్నాయి.

యుద్ధావసరాలకోసం కావలసిన భారీపరిశ్రమలనేగాక ప్రజల నిత్యజీవనానికి కావలసిన కొద్దిపాటి పరిశ్రమలనుకూడా ప్రభుత్వం ప్రోత్సహిస్తూ, చైనా స్వయం సంపూర్ణత్వము నొందడానికి ప్రయత్నిస్తోంది. 1938 లో

30,000 బేళ్ల నూలుమాత్రమే ఉత్పత్తిచేస్తూండిన చైనా 1941లో 1,00,000 బేళ్ల నూలు నుత్పత్తిచేయగలిగింది. దేశీయపరిశ్రమల నతిజోరుగా అభివృద్ధిచేయడం, దేశంలో అన్ని యంత్రాలను తయారుచేయడమేగాక గత అయిదారేండ్లలోనూ ఇతర దేశాలనుండి 20,000 టన్నుల క్రొత్తమరలను దిగుమతిచేసుకుంది చైనా.

## ప్రభుత్వ పారిశ్రామిక దృష్టి

చైనా పునర్నిర్మాణ కార్యక్రమంలో పారిశ్రామికాభివృద్ధికి ముఖ్యస్థానమిచ్చింది ప్రభుత్వం. భూగర్భస్థమైన ఖనిజసంపద నపారంగా త్రవ్వి, ఫ్యాక్టరీ పరిశ్రమలను స్థాపించి, ప్రజాసంస్థలు నడిపే పరిశ్రమలకు చేయూత నిస్తోంది ప్రభుత్వం. ప్రభుత్వ పరిశ్రమలకు, పెట్టుబడిదారీ పరిశ్రమలకు పోటీరాకుండేందుకు సహకారత, అన్యోన్యత హెచ్చేందుకు తగిన వాతావరణం కల్పిస్తోంది చైనా ప్రభుత్వం. యుద్ధ పరిశ్రమలకు పెట్టుబళ్లుపెట్టి, యుద్ధ పరికరాలను భీమాచేసే పద్ధతి నెలకొల్పి, ప్రభుత్వం పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడుతోంది. అత్యవసర పరిశ్రమలను అజమాయిషీ చేసేందుకు "జాతీయ సంపద సభ" అనే సభ నొకదానిని స్థాపించింది చైనా ప్రభుత్వం. ఈ సభ యాజమాన్యంక్రింద 42 గనులు, 18 విద్యుచ్ఛక్తి పరిశ్రమలు, 32 ఇతర పరిశ్రమలు చేస్తున్నాయి. పారిశ్రామిక పునర్నిర్మాణమే ఈ సభయొక్క ఆశయం.

"జాతీయ సంపద సభ" ప్రభుత్వ పరిశ్రమాభివృద్ధికి పాటుబడుతూంటే మరొక జాతీయ సభ పెట్టుబడిదారీపరిశ్రమలకు చేయూతనిస్తోంది. పెట్టుబడిదారులకు స్వల్పవడ్డీలమీద డబ్బు సరఫరాచేయడం, ముడివస్తువులను, యంత్రాలను, చౌక ధరలకు సరఫరాచేయడం, పారిశ్రామిక సంబంధమైన సలహాల నివ్వడం—ఇవీ ఈ జాతీయసభ ముఖ్య విధులు.

శత్రువిమాన దాడినుండి కలిగే నష్టం తగ్గించడంకోసం, నూతనంగా నిర్మించే యంత్రాలను, పరిశ్రమలను వాటికోసం ప్రత్యేకంగా త్రవ్విన పెద్ద గోతులలో స్థాపిస్తున్నారు. 10,348 ఘనపుటడుగుల పరిమాణంగల గోతిలో ఒక బట్టలమర స్థాపించారు. శత్రువిమానదాడి దాన్నేమీ చేయలేదు. విమాన దాడి జరుగుతూన్నా బట్టలమిల్లు పని చేస్తుంది. ఈ విధంగా ప్రభుత్వం, ప్రజ ఏకోన్ముఖులై విజయకాంక్షతో, ఉత్కృష్టాశయాలతో, సర్వతో ముఖ వికాసంకోసం పాటుబడుతున్నా రీనాటి చైనాలో.

# 8. ఆర్థిక పర్యాలోకనం

వ్యవసాయ ఫలసాయం చాల తక్కువవడం, పరపతి మిక్కిలి కష్టంమీద పుట్టడం, పన్నులభారం, ముఖ్యంగా భూశిస్తులభారం ఎక్కువవడం, ఆర్థిక జీవనాని కుపకరించని భూతారముల పద్ధతి—ఇవీ నేటి చైనా రైతును బాధించే ఆర్థిక పిశాచాలు.

రాజకీయంగా సుస్థిరమైన ప్రభుత్వం ఏర్పడి, దేశంలో శాసనబద్ధమైన పరిపాలన సక్రమంగా సాగితేనేగాని ఆర్థికాభివృద్ధి చేయడానికి తగిన అవకాశాలు చిక్కవంటుంది 'నాన్‌కింగ్' ప్రజాప్రభుత్వం. కాని రాజకీయ సంస్కరణలతోబాటు ఆర్థిక పునర్నిర్మాణంకూడా జంటగా జరగడం అత్యావసరమని పోట్లాడుతారు కమ్యూనిస్టులు.

వ్యవసాయ ఫలసాయం ఎక్కువ చేయడానికి, పరపతివసతులు అభివృద్ధి చేయడానికి చైనా ప్రభుత్వం, ప్రజ ఏకోన్ముఖంగా సహకార పరపతి సంఘాలద్వారా ఎలా కృషిచేస్తున్నారో క్రిందటి అధ్యాయంలో చెప్పాము. కాని చైనా రైతునుపీల్చి పిప్పిచేసేవి అత్యధిక పన్నులు. ముఖ్యంగా భూశిస్తులు. సహకారోద్యమాభివృద్ధికి తోడ్పడుతూ, రాకపోకలకు సౌకర్యంగా రోడ్లు నిర్మిస్తూ కర్షకజీవనం సుఖదాయకంగా చేయడానికి 'కుమిన్‌టాంగ్' పక్షం కొంతవరకు పాటుపడిన మాట నిజమే. అయితే, ఈ పక్షంలో చాల మంది భూస్వాములు, జమీందారులు ఉండంచేత, భూశిస్తు విధానంలో ఎక్కువ మార్పులు తీసుకురాలేక పోయింది ప్రజాప్రభుత్వం.

1931 లో "జాతీయ ఆర్థిక సభ" నొకదానిని స్థాపించి, 'కుమిన్‌టాంగ్' పక్షం చైనా ఆర్థికాభివృద్ధికి చాలా కృషిచేసింది. ఈ సభ ప్రజా ప్రభుత్వానికి సలహానిస్తూ, అజమాయిషీ చేయడానికే మొట్టమొదట్లో ఏర్పడింది. కాని క్రమేణా కార్యక్రమమంతా నెత్తినవేసుకుని, యీ సభ ఆర్థిక, సాంఘిక సంస్కరణలలో పూనుకోక తప్పిందికాదు. రాష్ట్రీయ ప్రభుత్వాల సహకారంతో ఈ సభ చైనా ఆర్థికజీవనంలో విప్లవం తీసుకురాగలిగింది

ఏటేటా వరదలవల్ల చైనా రైతుకుకలిగే నష్టం అపారం. ఇటీవల 'పచ్చనది' వరదలవల్ల చైనా ప్రజలకెంతో నష్టం గలిగింది. ఏటేటా తమ

ప్రవాహపు దారులను మార్చుకునే చైనానదుల విచిత్ర చర్యలనుండి ప్రజలను రక్షించే ప్రయత్నాలు ప్రభుత్వం చేస్తేనేగాని చైనా ఆర్థిక జీవనానికి కొంత సుస్థిరత ఏర్పడదు. 'జాతీయ ఆర్థిక సభ' యిందుకు చాలా తోడ్పడినా, యీ యుద్ధపు రోజులలో ఆ సభ చేతిలో ఎక్కువ డబ్బులేక వరదలనాపే పనులమీద ఎక్కువ ఖర్చుపెట్టలేక పోతోంది.

చైనా ఆరోగ్యాభివృద్ధికి త్రివర్ష ప్రణాళిక నొకదానిని అమలులో పెట్టి, విదేశీయ వైద్యశాస్త్రజ్ఞుల సహాయంతోను, అంతర్జాతీయ వైద్య శాస్త్రజ్ఞుల సలహాలతోను ఆధునిక విజ్ఞాన వేత్తలగు చైనా యువకుల కృషి వల్లను, ఆరోగ్యాభివృద్ధికరమగు పను లెన్నో చేయగలిగింది 'జాతీయ ఆర్థిక సభ.'

1937 లో సుస్థిరమైన కేంద్రప్రభుత్వం స్థాపించేవరకు చైనాలో నవీన ఆర్థిక పద్ధతులు అమలులోకి రానేలేదనవచ్చును. అంతకు పూర్వముండిన భూస్వామిక విధానపు ప్రాతపద్ధతుల సాక్కుపోనేలేదు. 'నాన్‌కింగ్' ప్రభుత్వం స్థాపించేసరికి చైనా ఆర్థిక పరిస్థితులు అల్లకల్లోలంగా ఉన్నాయి. 1937 వరకు చైనాకు విదేశాలలో పరపతి పుట్టేదే కాదు. ఈ పరిస్థితులకు కారణం ఏమిటంటే చైనా రాబడి దాని ఖర్చులకుచాలదు. వరదలు, దేశంలోని అంతర్యుద్ధాలు, విదేశీయుల దురాక్రమణ—ఇవే చైనారాబడి తగ్గడానికి ముఖ్యకారణాలు. 1928 లో ఆర్థిక స్వాతంత్ర్యం అమలుపరచడంవల్ల చైనా రాబడి కొంతవరకు హెచ్చింది. దిగుమతులమీది పన్నులను హెచ్చించేసరికి, మునుపటికన్నా మూడురెట్లు ఆదాయం వస్తోంది. టి. వి. సూంగ్ కృషివల్ల ఉప్పుపన్ను పద్ధతులు 1928 లో సంస్కరింపబడడంవల్ల దానినుండి రాబడి రెట్టింపయింది. పొగాకు, బ్రాంది, నూలు మొదలగు వస్తువులమీద పన్నులు అధికం చేయడంవల్ల, 1929 లో రూ 5,85,00,000 ఆదాయం మాత్రమే వస్తే, 1936 నాటికి రూ 20,40,00,000 వరకు హెచ్చింది. ఉప్పుపన్ను, దిగుమతి పన్నులవల్ల 1929 లో రూ 55,35,00,000 వస్తే, 1936 నాటికి రూ 90,90,00,000 హెచ్చింది ఆదాయం.

ఆదాయం హెచ్చుతూన్నా చైనాకు అమితమగు ఖర్చుంది. అప్పు చేయక తప్పిందికాదు. చైనా విదేశాలనుండి ఎంతో అప్పుచేసింది. 1937 నాటికి చైనాకు రూ 675,00,00,000 అప్పుంది. చైనాకున్న అప్పులు మూడు విధాలుగా విభజించవచ్చును:—

(1) ఎగుమతి దిగుమతి పన్నుల హామీ మీద చేసిన అప్పు.

(2) ఉప్పు పన్ను హామీ మీద చేసిన అప్పు.

(3) ప్రభుత్వ హామీ మీద రైల్వే కంపెనీలు చేసిన అప్పు.

అంటే 1937 నాటికి ఒక్కొక్క చైనా మనిషికి సుమారు రూ. 15 అప్పు సగటున ఉందన్నమాట.

## చైనా కరెన్సీ విధానం

చైనా మొదటినుండీ వెండి కరెన్సీ పద్ధతిని ఆచరణలో పెట్టింది. కాని, ప్రపంచంలోని ముఖ్యదేశాలలో బంగారపు కరెన్సీ పద్ధతు లుండేవి. ఇందువల్ల 1935లో చైనా తన కరెన్సీ పద్ధతులను సంస్కరించుకోవలసిన అవసరం కలిగింది. వెండి యితర దేశాలకు, ముఖ్యంగా అమెరికాకు ఎగుమతి కావడం వల్ల చైనాలో వెండి ధర హెచ్చింది. దానితో చైనాలో వస్తువుల ధరలు హెచ్చాయి. విదేశాలలో పరపతి పుట్టడం తగ్గింది. అంతర్జాతీయ వ్యాపారం మందగించింది. నిరుద్యోగం ప్రబలింది. ఈ పరిస్థితులకు కారణాలు చైనా అంతటనూ ఒకేవిధమైన కరెన్సీ పద్ధతి అమలులో లేకుండడం, నాణెముల నచ్చువేయడంలో దశాంశపద్ధతిని పూర్తిగా అనుసరించకపోవడం, వెండి ఎగుమతు లెక్కువయి, వెండి ధర హెచ్చి తదితర ధరలు కూడా హెచ్చడం, మారకపు రేట్లు తారుమారవడం—అని టి. వి. సూంగ్ ఆలోచించి, కరెన్సీ సంస్కరణలు సాగించాడు. 1934 లో విదేశాలకు వెండి ఎగుమతి చేయకూడదని చైనా ప్రభుత్వం శాసించింది. దేశంలోని వెండి నంతను ప్రభుత్వాధికారంక్రిందికి తెచ్చి, చైనా డాలరు కొక సుస్థిరమైన మారకపురేటు తేగలిగింది చైనా ప్రభుత్వం. కేంద్ర చైనా బ్యాంకు, చైనా బ్యాంకు, రాకపోకల బ్యాంకు-అనే మూడు బ్యాంకులకు మాత్రం నోట్లు

చలామణీ చేయడానికి అధికారం యిచ్చింది చైనా ప్రభుత్వం. 'సర్. ఫ్రెడ్రిక్ లీత్రాస్.' అనే బ్రిటిషు ఆర్థికవేత్త సలహాతోనూ, బ్రిటను, అమెరికాల సహాయంతోనూ 1935లో చైనా చేసిన కరెన్సీ సంస్కరణలవల్ల చైనా ఆర్థిక సుస్థిరత చేకూరిందనాలి. చైనా చరిత్రలో అంతవరకు లేని సుస్థిరమైన మారకపు పద్ధతులు లభించాయి. చైనాకు అప్పు యివ్వడమంటేనే జడిసే విదేశాలు చైనా ఆర్థిక సుస్థిరతను చూచి అప్పులివ్వడానికి ముందంజవేశాయి.

## చైనా వ్యాపారం

చైనాకు ఎగుమతులకన్నా దిగుమతులు ఎక్కువ. ఇతర దేశాల కివ్వవలసిన అప్పులమీది వడ్డీలు, దిగుమతులవిలువ కలిపితే ఎగుమతులవిలువ, ఎగుమతి, దిగుమతి పన్నులవల్ల వచ్చే రాబడికన్నా ఎక్కువ.

పట్టు, తేయాకు, కలప, తోళ్లు, గ్రుడ్లు, గ్రుడ్లతో చేసిన ఆహారాలు, టంగ్‌స్టన్, యాంటిమొనీ, తగరం, చేతిపరిశ్రమల వస్తువులు—ఇవీ చైనా ఎగుమతులు. యంత్రాలు, యంత్రోత్పాదితమైన సామానులు, రసాయనిక వస్తువులు, యుద్ధపరికరాలు—ఇవీ దిగుమతులు.

1937లో చైనా దిగుమతులు, ఎగుమతులకన్నా రూ. 17,40,00,000 ఎక్కువ. 1939లో రూ. 861,60,00,000 ఎక్కువ. యుద్ధంవల్ల దిగుమతుల విలువ ఎక్కువయింది. కాని జాతీయ ప్రభుత్వం, విదేశాలతో మారకపురేట్లు స్థిరంగా వుండడంకోసం, ఎగుమతులకు ఉపారిస్తూ, దేశీయ పరిశ్రమల నభివృద్ధిచేస్తూ, కొన్ని దిగుమతులమీద నిర్బంధ విధానాన్ని అమలుపరుస్తోంది. ఎగుమతుల నభివృద్ధి చేసికోడానికి, యుద్ధావసరాలను దిగుమతి చేసికోడానికి వుపకరించేటట్లు 1937 నుండి 'బర్మా రోడ్డు'ను బాగుచేసి, టర్కీ, సైబీరియా రోడ్డును నిర్మించి, సుమారు 5,700 కిలోమీటర్ల రోడ్లను క్రొత్తగా వేశారు. కాని, కారణాంతరాలచేత బర్మారోడ్డు మూయడం, చైనాకు వస్తుసరఫరా లేక కష్టపడడం అందరూ ఎరిగిందే!

చైనా-జపాన్ యుద్ధానికి పూర్వం దేశీయ అంతర్జాతీయ మారకపు రేట్లు ఎక్కువ ఒడుదుడుకులు లేకుండా స్థిరంగా ఉండి చైనా వ్యాపారం సాఫీగా నడచేది. కాని, యుద్ధంవల్ల అంతర్జాతీయ వ్యాపారం బందపడమే గాక, రాకపోకల సౌకర్యంలేక దేశీయ వ్యాపారంకూడా కుంటుపడింది. అంతర్జాతీయ మారకపు రేట్లు అల్లకల్లోల మయినాయి. 1937 నాటికి చైనా నాణెమగు 'యుయాను' అమెరికా దేశపు 30 సెంట్లకు మారకమయ్యేది. కాని, 1940 నాటికి ఒక యుయాను, అమెరికావారి 4½ సెంట్లకు మాత్రం మారకమయింది. దీన్నిబట్టి చైనా దేశపు నాణెముల కొనుగోలు శక్తి ఎంత తగ్గిపోయిందో మనకు స్పష్టమవుతుంది. యుద్ధావసరాలకు కావలసిన సామగ్రి, యుద్ధ పరికరాలు తయారీ చేయడంలో ప్రజా శక్తి కేంద్రీకరించడం చేత, నిత్యావసరాలకు కావలసిన ఆహారోత్పత్తి తక్కువైపోయి చాలా వస్తువుల సరఫరా తగ్గింది. సరఫరా తగ్గేసరికి ధరలు ఏడెనిమిదిరెట్లు పెరిగిపోయాయి. నిత్యావసరాల ధరలు విపరీతంగా పెరిగేసరికి ప్రజల ఆర్థిక జీవనం కష్టతరమయింది.



వాంగ్, చైనా రాయబారి అతని భార్య, కుమార్తెలు. వాషింగ్టన్‌లో చైనా రాయబారిగానుండి (1937) అమెరికా, చైనాల సఖ్యతను బలపరిచాడు.

దీనికితోడు చైనా భాగ్యవంతులు వెండి, బంగారాలను దాచుకుని కరెన్సీ నోట్లను మాత్రం విరివిగా చలామణిలోకి తీసుకురావడంవల్ల చైనా కరెన్సీకి కొనుగోలుశక్తి మరింత తగ్గిపోయి, ధరలు మరీ విపరీతంగా పెరిగి, ఆకలి మంటలు లేచి, ఖాళీ కడుపు లెక్కువయ్యాయి.

ఇటి క్లిష్ట పరిస్థితులను గ్రహించి చైనా ప్రభుత్వం సహకారోద్యమానికి చేయూతనిచ్చి, గృహ పరిశ్రమలను నెలకొల్పింది. చైనా-జపాన్ యుద్ధం వల్ల కోస్తాప్రాంతాల పరిశ్రమలన్నీ, దేశమధ్యప్రాంతాలకు తప్పనిసరిగా పోవడంవల్లనూ, శత్రు విమానదాడులకు గురికాకుండా పరిశ్రమలు అనేకచోట్ల స్థాపించడం ఆవశ్యం అవడంవల్లనూ, ప్రభుత్వం శ్రద్ధవహించి విద్యుచ్ఛక్తి సరఫరా ఎక్కువజేసి ప్రతి పల్లెకూ విద్యుచ్ఛక్తిని పంపుతూ గృహ పరిశ్రమల అభివృద్ధి చేస్తూంది.

## నవజీవనోద్యమం

1934లో మార్షల్ చంగ్ కై షెక్ లేవదీసిన నవజీవనోద్యమం చైనా రాజకీయ, ఆర్థిక జీవనంలో అఖండమైన మార్పులు తెచ్చిందని చెప్పాలి. "మాతయగు అవసరము నిర్మాణమునకు" అన్న సామెతయే యీ ఉద్యమానికి మూలకారణం. చైనాకు ఏకైక నాయకుడైన చంగ్ కై షేక్ వంటి నీతిజ్ఞుడే యిట్టి ఉద్యమాన్ని జయప్రదంగా నడపడానికి సమర్థుడు.

చైనాదేశపు ఋషులు అయిదువేలేండ్లనాడే వ్రాసిపెట్టిన నీతినియమాల నన్నిటినీ మరచిపోయి నవ్యత అనుకుంటూ పాశ్చాత్య వ్యామోహంలో పడడమే చైనా అధోగతికి కారణమని మార్షల్ చంగ్ కై షెక్ దృఢనమ్మకం. ప్రాచీన, ప్రాచ్యసంస్కృతి పునరుద్ధరణమే చైనా ప్రజను మేలుకొలుపాలి అంటాడు షేక్. చైనా భాషలో "లీ" అంటే మనోనిగ్రహం, హృదయ స్థైర్యం అని అర్థం; "ఐ" అంటే సత్ప్రవర్తన; "లీన్" అంటే ఆత్మ గౌరవాన్ని నిలబెట్టుకోవాలనే నిశ్చలాభిప్రాయాలు కలిగివుండడి, వ్యక్తిగత జీవితంలోను, ప్రపంచ వ్యవహార నిర్వహణలోను, ఉద్యోగరీత్యాను గౌర

వాన్ని కాపాడుకోడం; "చిహ్" అంటే ఆత్మవిశ్వాసం కలిగిఉండడం. అయిదువేలేండ్ల ప్రాచీనత గల చైనా ప్రాచ్యసంస్కృతికి పై నాలుగు సూత్రాలు బీజాక్షరాలు. ఈ సూత్రాలు నిత్యజీవనంలో ఆచరణలో పెడితే ఉత్తమ పౌరస జీవనాన్ని ప్రజ అలవరుచుకుని తమ ఆర్థికాయుత జీవనం సుఖవంతం చేసుకోడానికి వీల్లున్నాయని షేక్ యీ నవజీవనోద్యమాన్ని పట్టుదలతో నడుపుతున్నాడు.

విదేశీయుల సామ్రాజ్యతత్వానికి గురియయి చైనా ప్రాచీన సంస్కృతి క్షీణించి శల్యావశిష్టమయింది. పశుత్వానికీ, రాక్షసత్వానికి చైనా నిత్య జీవనంలో ప్రాముఖ్యత హెచ్చింది. చైనావంటి విశాలఖండం స్వాతంత్ర్య దేశమయ్యీ, అపారసహజ ఖనిజసంపద ఉండికూడా నూటికి 90 మంది నికృష్టజీవనాన్ని గడపడానికి కారణమేమా? యని తీవ్రంగా షేక్ ఆలోచించగా తట్టిన ఆలోచనల ఫలితమే యీ నవజీవనోద్యమం. నేటి చైనా నిత్య జీవనంలోని పశుత్వాన్ని, రాక్షసత్వాన్ని నిర్మూలించాలంటే, ప్రాచీన సంస్కృతిలోని నిగ్గును, కళలను ప్రజాసామాన్యంలో ప్రబోధం చేయాలి. వ్యక్తిగత నీతినియమాల నభివృద్ధి చేసుకోవాలి చైనా పౌరుడు. చైనా జాతిలో పాశ్చాత్య వ్యామోహాంవల్ల నాటుకుపోయిన చెడ్డ అలవాట్లను పెకలించివేసి, చీనా ప్రాచీన సంస్కృతిని పునరుద్ధరించడమే యీ ఉద్యమ పరమాశయం.

పైన వివరించిన నాలుగు గొప్పసూత్రాలను ప్రజాజీవనంలో ప్రవేశ పెట్టాలంటే, నిత్యజీవనాన్ని మూడు విధాలుగా భాగించాలి :—

(i) నిత్యజీవనానికి కావలసిన వస్తుజాలాన్ని సేకరించడం.

(ii) అట్టి వస్తువులలో ఉత్తమ తరగతివాటి నేరుకోడం.

(iii) ఆ వస్తువుల నేవిధంగా ఉపయోగిస్తే మానవునకు మంచి సుఖం చేకూరుతుంది కనుగొనడం.

(i) వస్తువులను సేకరించడానికి "లీన్" అనే సూత్రాన్ని ఆచరణలో పెట్టాలి. అంటే మనకు కావలసిన వస్తుజాలాన్ని చెమటోడ్చి అయినా సేక

రించాలి. లేదా యితరుల నన్యాయం చేయకుండానైనా సంపాదించాలి. ఇతరుల శ్రమమీద చీడపురుగుల్లాగ జీవించే ప్రజకు సంఘంలో ఏమాత్రం తావులేదు. ఇచ్చి పుచ్చుకోడాలలో అన్యాయా లుండకూడదు. ఈ విధంగా సంఘ ఆర్థికాభివృద్ధికి ఎంతో తోడ్పడవచ్చును.

(ii) వస్తుజాలంలో ఉత్తమతరగతివాటి నేరుకోడంలో "ఐ" అనే సూత్రాన్ని ఉపయోగించాలి. అందరూ అందలమెక్కాలంటే కష్టమేను. ఉత్తమ, మధ్యమా లాలోచించి ప్రవర్తించాలి సంఘంలో. సేనాధిపతికుండే హక్కులే సైనికులకుగూడా ఉండాలంటే శిక్షణాయుతమైన జీవితం ప్రజల కలవడడం కష్టం. శిక్షణాయుత జీవనం ఉంటేనే ఏ దృక్పథంలోనైనా ఒక జాతి ముందుకు రాగలిగేది.

(iii) వస్తువుల నుపయోగించడంలో "లీ" అనే సూత్రం మనస్సులం దిడుకోనాలి. అంటే వ్యక్తికీ, వ్యక్తికీ మధ్య ఉండే ప్రకృతి సంబంధాల నర్థంచేసికొని, సాంఘిక సూత్రాలను గ్రహించి, జాతీయశిక్షణకు లొంగాలి.

ఇట్టి ఉత్కృష్టాశయాలతో మార్షల్ చంగ్ కై షేక్ వంటి గొప్ప ధీశాలిచే నడుపబడుతూన్న ఈ నవజీవనోద్యమం చైనా ఆర్థికాయుత జీవనాభివృద్ధికి ఎంతో తోడ్పడుతోంది. ఈ ఉద్యమం నిజంగా చైనా నికృష్ట ఆర్థిక జీవనాన్ని బాగుచేసి నిర్జీవమైన చైనాజాతికి ప్రాణప్రతిష్ఠ చేసిందనాలి. నేటి చైనా యుద్ధంలో మునిగికూడా ఆర్థికంగా ఎంతో ముందంజవేసింది.

---

# 9. చైనా - ఇండియాల చిరకాల సఖ్యము

మహోన్నతమైన హిమాలయ పర్వతాల కిరుప్రక్కలా చైనా — భారత దేశాలున్నాయి. ఈ రెండు దేశాలూ కూడా బహు పురాతనమైనవీ, మహిమాన్వితమైనవీను. పాశ్చాత్య ప్రపంచం అజ్ఞానావస్థలో నున్నప్పుడే యీ రెండు దేశాలు అత్యుత్తమ సభ్యతలతో విరాజిల్లినాయి. జనరలిస్మో చంగ్ కై షెక్—భారతదేశ రాజప్రతినిధుల మధ్య సంభాషణలు, చైనా—భారతదేశాల మధ్య సఖ్యత పునరుద్ధరించడం చూస్తూంటే సామాన్య ప్రజలకే గాక, చదువుకున్న విజ్ఞానులకుగూడ గొప్ప ఆశ్చర్యంగా ఉంది. ఈ రెండు దేశాలకు మధ్య సఖ్యత నవ్యయుగంలో జరిగిన గొప్ప మార్పుఅని అనుకుని చాలామంది భ్రమపడుతున్నారు. కాని యిది సత్యదూరం. ఈ రెండు దేశాల సఖ్యత మిక్కిలి ప్రాచీనమైందీ, సర్వతోముఖమైందీను. అట్టి పురాతన సఖ్యతను మరచిపోయాము. ఈనాడు భారత ప్రజ, ప్రభుత్వం ఏకోన్ముఖంగా చైనా — భారతదేశాల సఖ్యతను పునరుద్ధరించడానికి ప్రయత్నించడం ప్రశంసనీయం. దూర ప్రాచ్యప్రాంతాల యుద్ధ నిర్వహణలో చైనా సహాయం అత్యవసరమవడంవల్ల బ్రిటిష్ ప్రభుత్వం చైనా ఎడల సానుభూతి చూపక తప్పిందికాదు. కాని చైనా — భారత ప్రజల సఖ్యతకు యీ యుద్ధ పరిస్థితులే కారణంగాదు. ఈ రెండు దేశాల సఖ్యత ఎంతో గాఢమైంది, అగాధమైందీను. చైనా — భారతదేశాలను అక్కచెల్లెండ్రకు పోల్చవచ్చును. ఈ సోదరీమణులు, అయిదు వేలేండ్లక్రితమే నవయౌవనులై, అగర్భ శ్రీమంతులై, భోగభాగ్యాలతో తులతూగిన రోజులున్నాయి. ఇద్దరూ పరస్పర మైత్రివల్ల, గాఢానురాగంవల్లనూ ఒకరి గుణాలు ఒకళ్లు అలవర్చుకున్నారు. ప్రకృతిమాతకు పైడి కంకణాలు చేయించిపెట్టారు. కాని వారిద్దరి ప్రతిభ కాలగర్భంలో లీనమైపోయింది. ఇద్దరి శక్తీ క్షీణించింది. శల్యావశిష్టమయ్యారు. ఇద్దరి గాఢ కౌగిలి యిట్టే విడిపోయింది. వారి మహిమాన్విత జీవితాలు శిథిలమయిపోయాయికాని వారి ఆత్మజ్యోతులు మాత్రం యింకా మిణుకుమిణుకుమంటూన్నాయి. వారిలో ఒకామె

(అంటే చైనా) పునర్జీవించి, నూతనావతారమెత్తింది. మరొకామె (అంటే భారతదేశం) పునర్జీవించడానికి నిరంతర స్వాతంత్ర్య కృషి సల్పుతోంది.

రాకపోకలకు సౌకర్యాలు సరిగాలేని పూర్వకాలంలోకూడ, కొండలు, ఎడారులు దాటి, ఎన్నో కష్టాలకోర్చి, విద్వాంసులు చైనానుండి భారతదేశానికి, భారతదేశాన్నుండి చైనాకు పోతూండేవారు. రేడియోలు, విమానాలు, ఓడలు, కారులు పెచ్చుమీరిన నవ్యయుగపు ప్రపంచ యాత్రా పరులవలె యిక్కడ ఎక్కి అక్కడ దిగడంకాదు ఆనాటి యాత్రికులు చేసింది. విజ్ఞానపిపాసతో కాలినడకను ఎన్నో కష్టాలకోర్చి వారు వచ్చి ఏండ్లతరబడి పరదేశాలలో ఉండిపోయేవారు. దారీ, డొంకాలేని పురాతనపు కొండప్రదేశాలలోనుండి మత ప్రచారకులు, యాత్రికులు, వర్తకులు చైనా నుండి భారతదేశానికి వస్తూండేవారు. ప్రాక్ ప్రశ్చిమాలకు భారతదేశ మొక కూడలి ప్రదేశంగాను, వర్తక కేంద్రంగాను ఉండేది. ప్రక్కనే ఉన్న జపాన్ కూపస్థ మండూకంవలె తనలో తానే మణిగియున్న రోజులలో చైనా తన కళలను, పరిశ్రమలను, వేదాంతాన్ని, నదులు, కొండలు దాటి సముద్రాలు లంఘించి భారతదేశంలో ప్రచారంచేసినట్లు చారిత్ర కాధారాలున్నాయి. భారతదేశ మంటే ఆనాడు, పాశ్చాత్యులకు, ప్రాచ్యులకుగూడా "స్వర్ణభూమి".

చైనా భారతదేశాల సఖ్యతకు మూలవిరాట్టు బుద్ధ భగవానుడు. బుద్ధుడు భారతీయుడు. ఆయనకు చైతన్యం కలిగినది భారతదేశంలో. నిర్వాణంకూడా ఇక్కడే లభించింది. అశోక చక్రవర్తి కాలంలో మన బౌద్ధమతం చైనాకు విరివిగా ప్రాకింది. చైనాలోని, టోయిజం, కన్ ఫ్యూషియనిజం, లాటెజ్ సిద్ధాంతములలో విగ్రహారాధనకే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చేవారు. కాని బౌద్ధమత వ్యాపకంవల్ల చైనావారి వేదాంత దృక్పథంలో గొప్ప మార్పు వచ్చింది. నిర్గుణాత్మకమైన పరమాత్మను సేవించి తరించడం నేర్చుకున్నారు చైనావారు బౌద్ధమతంవల్ల. ఇతర మతాలెన్నో చైనాలో వున్నా చైనాలో బౌద్ధమతానికి ఎక్కువ ప్రాముఖ్యత ఉంది. హిందూ

బౌద్ధయుగపు రోజులనాటి శిల్పానికి, కళలకు, ఆనాటి చైనా శిల్పానికి, కళలకు ఎన్నో పోలికలున్నాయి. క్రీస్తు తరువాత 490-వ సంవత్సరంలో నిర్మించిన "ష్యాషీ"లోని "కొయాన్ కాన్" గుహలలోను, "హొనాన్" లోని "లంగ్ మెన్" గుహలలోను బౌద్ధ శిల్పము అచ్చుగుద్దినట్లుంది చైనాలో. అశోకుని కాలంలోనూ, తరువాతనూ మనదేశంలో బౌద్ధ మతాన్ని నిరసించడంవల్ల చాలామంది బౌద్ధమతస్థులు యితర దేశాలకి వలస పోక తప్పింది కాదు. పదివేల బౌద్ధ కుటుంబాలు ఒక్కుమ్మడిగా చైనాకు వలసపోయాయి.

అశోకుని తరువాత 600 ఏండ్లవరకు చైనానుండి మనదేశానికి వచ్చిన యాత్రికుల వ్రాతలవల్ల చైనావారికి బుద్ధుని మాతృదేశ మగు భారతదేశ మంటేను, భారత సంస్కృతి అంటేను ఉండే గౌరవం తెలుసుకోవచ్చును. భారతదేశానికి స్వర్ణయుగమగు గుప్త సామ్రాజ్యపు రోజులలో (అంటే క్రీస్తు తరువాత 5-వ శతాబ్దంలోనే) 'ఫాహియాన్' పశ్చిమ చైనా దుర్గ మారణ్యాలను ప్రాణాలు అరిచేతిలో పెట్టుకుదాటి భారతదేశం చేరు కున్నాడు. భారతదేశం రావడాని కాయనకు ఆరేండ్లు పట్టింది. ఇంకో ఆరేండ్లపాటు ఆయన భారతదేశంలో పర్యటన గావించి హిందూ సాంప్ర దాయాలలోని సారాన్ని, మతాలలోని నిగ్గును అవగాహన చేసుకున్నాడు. ఆనాటి భారతదేశపు పట్టణాల ప్రజాబాహుళ్యాన్ని గురించీ, భోగభాగ్యా లను గురించీ ధర్మ వైద్యశాలలు, విశ్వవిద్యాలయాల్లో వేలకువేలు చదువు కోడం మొదలగు విషయాలమీద ఎంతో అద్భుతంగా వ్రాశాడు ఫాహియాన్. ఫాహియాన్ స్వదేశానికి పోవడానికి మరల మూడేండ్లు పట్టింది.

క్రీస్తు తర్వాత 629-లో హర్షవర్ధనుని కొలువుకు "హ్యూయిన్ ట్సాంగ్" అనే చైనా యాత్రికుడు వచ్చాడు. హర్షవర్ధనుడు గొప్ప సారస్వతాభిలాషి యవడంవల్ల పండితోత్తములను తన సభకు ఆహ్వానించి గౌరవించేవాడు. అప్పట్లో పాటలీపుత్ర మనబడే నేటి పాట్నాలో నుండిన

నలందా విశ్వవిద్యాలయంలో విద్య నభ్యసించడానికి హ్యూయిన్‌ట్సాంగ్ వచ్చాడు. నలందా విశ్వవిద్యాలయంలో ఆనాడు 10,000 మంది విద్యార్థులుండేవారనీ, నాలుగు అంతస్తులు గల ఆరు గొప్ప మేడలలో విద్యార్థులకు వసతులుండేవనీ హ్యూయిన్‌ట్సాంగ్ వ్రాశాడు. హిందూదేశము "ఇందు-భూమి" అంటే చంద్రుని ప్రదేశమనీ, భారత దేశానికున్న ప్రకృతి శోభ వల్ల ఆమెను ఇందు భూమి యనడం సమంజసంగా ఉందనీ హ్యూయిన్‌ట్సాంగ్ వ్రాశాడు. చైనా భాషలో "ఇంటు" అంటే చంద్రుడనీ, భారతీయుల "ఇందు," చైనావారి "ఇంటు" కూడ సంస్కృతం నుండే పుట్టాయనికూడా హ్యూయిన్‌ట్సాంగ్ వ్రాశాడు. హ్యూయిన్‌ట్సాంగ్ సత్ప్రవర్తనకు, పాండిత్యానికి, హర్షవర్ధనునివంటి పండిత ప్రకాండుడు కూడ ముగ్ధుడయ్యాడు. పదునెనిమిదిరోజులు వరుసగా జరిగిన ఒక వేదాంత విషయిక సభలో మాట్లాడుతూ, బౌద్ధమతమంటే కొందరికుండే దురభిప్రాయాలను పటాపంచలు చేశాడు హ్యూయిన్‌ట్సాంగ్.

మతవిషయికంగా చైనా భారతదేశాల పరస్పర మైత్రి ఏర్పడడమే గాక, విద్య, విజ్ఞానం, సంస్కృతి ఎడల గౌరవం చూపడంలోగూడ యీ రెండు దేశాలకు పోలికలున్నాయి. ఈ రెండు దేశాల్లోనూ చక్కటి కవిత్వం ఆ రోజుల్లోనే వెలువడింది. నాటకరచనకు కూడా అప్పుడే ప్రాముఖ్యత వచ్చింది. అందమంటే ఉబ్బి తబ్బిబ్బయ్యే జాతి చైనాజాతి. పట్టుపరిశ్రమలోను, కుండలమీదను, శిల్పంలోనూ, రంగురంగుల రాళ్లను ఉపయోగించడంలోను చైనావారు తమ కళాప్రయత్నాన్ని చాటుతున్నారు. ఈ తత్వమే భారతదేశంలోకూడ కనపడుతోంది. "ప్లాసీవద్ద చచ్చిపోయిన భారతదేశానికి" పూర్వం, మనదేశం కళలకు పుట్టినిల్లని విల్‌డ్యూరెంటు వ్రాశాడు. నిత్యకృత్యాల్లోకూడ కళ ప్రతిబింబిస్తూండేది. అజంతా, ఎల్లోరాలలోని అత్యద్భుతశిల్పం, కంచుతో చేసిన విగ్రహాలు భారతీయుల కళాప్రయత్నానికి తార్కాణాలు. కమ్మరులు, కుమ్మరులు, కంసాలులు, ఎవరివృత్తి వారు చేసుకుంటూ ఎంతో పనితనం ఉట్టిపడే మిక్కిలి అందమైన వస్తువులను యావ

ద్భారతంలోనూ చేసేవారు. కాని నవ్యయుగపు యంత్ర శక్తివల్ల పూర్వపు చేతిపరిశ్రమలన్నీ క్రమేణా క్షీణించిపోయాయి. ఇప్పటికీ ఈ కళా ప్రయత్నపు వాసన చైనా భారతజాతుల కెందువల్ల యింకావుంది అనే విషయం ఆశ్చర్యంగా వుంటుంది. అది అంతర్గతమైన ఒక ఉత్తేజ శక్తి. ఇందువల్లనే ఎన్నో అవాంతరాలు గడిచి, యీనాటికికూడా కళాజ్యోతి మిణుమిణుకు మంటూంది.

యుగయుగాలుగా చైనా-భారతదేశాలను కరువులు,వరదలుఅనే రెండు పిశాచాలు బాధిస్తున్నాయి. ఇట్టి దుస్థితిలోకూడా, నిరుపేదలయ్యా ప్రజా బాహుళ్యం ఎంతో శాంతతతో, తత్వజ్ఞతతో జీవయాత్రగడుపుతారు. కర్మ, అదృష్ట మనేవి మానవాతీతమనియు, అవి అనుభవించి తీరాలిసిందేననే కర్మ సిద్ధాంతాన్ని చైనా-భారతదేశాలు అనుసరిస్తున్నాయి. చైనా-భారదేశాల కర్షక ప్రజలలో యిటీవల చైతన్యంగలిగి తమ ఆర్థికాయుత జీవనం కొంచెం బాగుచేసుకునేవరకు అత్యధిక అప్పులు, దారిద్ర్యము వారిని పీడిస్తూనే యున్నాయి. వీటికితోడు కాటకాలు, వరదలు. ఈ పరిస్థితులు ఈ రెండు దేశాల ప్రజల వ్యక్తిగత జీవితాలలో ఉత్తేజత్వమేమీ లేకుండాచేసినా, అనాది సిద్ధంగా వస్తూన్న అహింసాతత్వమే కాపాడుతోంది వారిని. తిండి లేక మలమల మాడుతూ,చావుకైనా సిద్ధపడతారుగాని, వారి నడవడికలో వక్రతకు వొప్పుకోరు.

కాలశక్తి అగణ్యము. కాలశక్తి ముందు మానవుడు అశక్తుడు. కాలవాహిని అనంతమైంది. ఎన్నోయుగాలను, సామ్రాజ్యాలను కాలవాహిని తన గర్భంలో లీనంచేసుకుంటూ అద్వితీయంగా ప్రవహిస్తూంటుంది. ఆ ప్రవాహపు ఆటుపోటులన్నీ పరమాత్మ ఆజ్ఞానుసారంగా వస్తూంటాయి. కాలవాహిని పరిణామమంతా విధాత యిదివరకే నిర్ణయించాడు. కాని మనుష్యమాత్రుడు యిదంతా తనకృషి ఫలితమేనని ఉబ్బి తబ్బిబ్బవుతాడు. కాలవాహినిమీద మానవుడొక బుడగని చాలమంది గ్రహించరు. మానవజీవితమంతా ఒక నాటకమనియు, దానికి సూత్రధారుడు పరమాత్ముడనియు చైనా-భారత

ప్రజల దృఢనమ్మకం. వారి జీవిత మూలసూత్రమే అది. కాని పాశ్చాత్యులకు కాలము అమూల్యమైంది. కాలాన్ని వృధాపుచ్చకుండా, కాలవాహినిలో నిజయాత్ర యీదడానికి ప్రయత్నిస్తారు పాశ్చాత్యులు. ప్రతి విషయంలోనూ కాలాన్ని గమనించి చూస్తారీ శ్వేతముఖులు. "ఎందుకయ్యా అంత ఆతురత !" అంటాడు నెమ్మదిగా ప్రాచ్యదేశస్థుడు.

ఆర్థిక, సాంస్కృతిక, వేదాంత విషయాలలో చైనా—భారతదేశాల కున్న పోలికలవల్లనే ఆ రెంటి సఖ్యత అనివార్యమయింది. కాని గత రెండు వందల సంవత్సరాలలోను పాశ్చాత్య నాగరికత చూచి విస్తుపోతూ, ఆశియా ఖండ దేశాలు పరదాస్య శృంఖలాలలో చిక్కి పరస్పర సంబంధంలేకుండా దీనావస్థలోనున్నాయి. ఇప్పుడు కాలం మారిపోతూంది. పూర్వం చైనా భారతదేశాలకు జరుగుతూన్న సాంస్కృతిక సంపర్కం మన తరంలో మళ్లీ టాగూరు మహాకవి పునరుద్ధరించాడు. ఆయన స్వయంగా చైనా అంతా పర్యటనంచేసి వచ్చి "శాంతినికేతనం" లో చైనాశాఖ నొకదానిని స్థాపించి తద్వారా చైనా కళలను, చైనా సాహిత్యాన్ని మన దేశంలో విస్తరింపజేయడమేగాక, చైనా విద్యార్థు లెంతమందికో అచ్చట మన కళలు, సాహిత్యం నేర్పుతున్నారు. వందలకొలది చైనా వ్రాత ప్రతులు, ఉద్గ్రంధాలు శాంతి నికేతనంలోని "చీనాభవనం"కి చేరుకున్నాయి. జపాను దురాక్రమణవల్ల రాజకీయంగాను, ఆర్థికంగాను కష్టాలపాలైన చైనా ఎడల భారతీయులకు సానుభూతి హెచ్చింది. భారతదేశం బానిసయయి, ఎంతో దీనావస్థలోవున్నా, ఒక ఆంబ్యులెన్సు యూనిట్ ను (క్షతగాత్రులకు చికిత్సచేయు వైద్యుల బృందము) చైనాకు సహాయార్థం పంపగలిగింది. 1939 లో జవహర్ లాల్ నెహ్రూ చైనా వెళ్లి భారతీయుల హృదయాన్ని, చంగ్ కై షేక్ దంపతులకు, చైనా ప్రజకు విప్పిచెప్పాడు. జవహర్ లాల్ కు చైనా ప్రజయిచ్చిన స్వాగతం ప్రపంచ చరిత్రలో సువర్ణాక్షరాల వ్రాశారు. తరువాత మార్షల్ చంగ్ కై షేక్ భార్యా సమేతుడై మన దేశానికి వచ్చి మన స్వాతంత్ర్య సమరంలో ఉండే లోతుపాతులు గ్రహించి వెళ్లినప్పటినుండి ఈ రెండు దేశాల మైత్రి మరింత గాఢమయింది.

ప్రాచ్యదేశాలలో చైనా యిప్పుడొక ఉజ్వలమైన వెలుగు. మన దేశంకూడా చైనా వలెనే త్వరలా నే స్వాతంత్ర్యం సంపాదించగలదు!! చైతన్యత పొందిన ప్రజాబాహుళ్యపు ధాటికి ఎంతమేటి సామ్రాజ్యాలయినా కూలిపోక తప్పదు!! మన కళ్ల ముందర జరిగిన చైనా, రష్యా విప్లవాలే యిందుకు నిదర్శనాలు. స్వాతంత్ర్య భారతదేశం— ప్రజాస్వామ్య చైనా కలిస్తే, ఆశియాఖండపు భావి చరిత్ర నే గాకుండా, ప్రపంచ భావి చరిత్రనుకూడా మార్పుచేయ గల ప్రతిభ చేకూరుతుంది వాటికి.



చెయాంగ్‌కై షేక్ దంపతులు

చైనా, జపాన్‌తో నేడు చేస్తూన్న ఘోర యుద్ధపు తాకిడి కెలా తట్టుకో గలుగుతోందాయని క్షణక్షణమూ ఆతురతతో భారతప్రజ పరికిస్తూ; భారతదేశపు ఏకైక ప్రజా ప్రతినిధియగు "భారతజాతీయ మహాసభ" ద్వారా చైనాకు సానుభూతి చూపుతూనే యున్నారు. చైనా-భారతదేశాల స్వాతంత్ర్య సమర విజయంమీదనే ఒక్క ఆశియాఖండపు భవిష్యత్తేగాక, ప్రపంచ భావివ్యవస్థకూడా ఆధారపడి ఉంటుందని భారతప్రజకు పూర్తిగా తెలుసు. చైనాకు బౌద్ధమత భిక్షపెట్టిన భారతదేశం చైనావారికి "స్వర్ణ భూమి". ఈ రెండు దేశాలకు యిన్నివేల సంవత్సరాలనుండీ సంబంధ బాంధవ్యా లున్నప్పటికీ, ఒక్క సంఘర్షణగాని, వైరుధ్యంగాని రాలేదు. చిత్తశుద్ధి, మానసిక నిగ్రహమే చైనా - భారతదేశాల సంస్కృతికి జీవగఱ్ఱ. ఈరెండు నైతిక సూత్రాలతోనే రెండు దేశాలల్లోనూ స్వాతంత్ర్య సమరాలు

జరుగుతున్నాయి, విజయాలు చేకూరుకున్నాయి. అసలు, జపాన్‌కు సభ్యతాభిక్ష పెట్టింది చైనాయేనంటే ముక్కుమీద వేలువేసికోని వారుండరు. కాని, 19వ శతాబ్దపు పాశ్చాత్య తాకిడివల్ల జపాన్ పాశ్చాత్య వ్యామోహంలో పడింది. పశుత్వం, రాక్షసత్వం ప్రబలినాయి. పారిశ్రామికాభివృద్ధి అంతూపంతూ లేకుండా జరగడం, సైనిక ప్రభుత్వ అధికారవాంఛతో రాజకీయాలను గుప్పెట్లో పెట్టుకుని ప్రజలను తమ చేతిలో కీలుబొమ్మలను చేయడం వల్ల, జపాన్ చైనానుండి నేర్చుకున్న నైతిక సభ్యతంతా వృథా అయిపోయింది. చైనా యుద్ధ పరిస్థితులవల్ల ఎన్నో ఆర్థిక కష్టాలకు గురియయినా, రాజకీయ స్వాతంత్ర్యం దానికుండడంవల్ల పుంజుకుని జపాన్‌ను ప్రతిఘటించ గలుగుతోంది. జపాన్‌తో యుద్ధము చైనాకొకమేలు కొలుపయింది. అంతవరకు ఉండే అంతఃకలహాలన్నిటినీ అణచివేసి, యుద్ధ యజ్ఞగుండంలో ఆహుతి కావడానికి చైనా వివిధ రాజకీయ పక్షాలు ఐకమత్యంతో సిద్ధమయ్యాయి. చైనా ప్రజాస్వామ్య మిప్పుడొక ఐక్యతగల జాతి అని అనిపించుకుంది. ఐక్యతతోను, ఐకమత్యంతోనూ నిలసిల్లే నేటి స్వాతంత్ర్య చైనా ఆశియాఖండానికి గొప్ప అండగా వుంటుంది. ప్రపంచభావి పునర్నిర్మాణంలో ప్రజాస్వామ్య చైనా-స్వాతంత్ర్య భారతదేశం ప్రముఖపాత్రలను వహించగలవు. గత ఆరేండ్లనుండి జరుగుతూన్న జపాన్‌తో యుద్ధమందు చైనా చేస్తూన్న కృషి శ్లాఘనీయము. కోస్తా పట్టణాలు, ఫలవంతమైన భూములు జపాన్ హస్తగతమయినా, ఆధునిక యుద్ధ పరికరాలు ఎక్కువలేక పోయినా, యిటీవలవరకూ యితర దేశాలనుండి ఏమీ సహాయం రాక పోయినా, అమెరికా సంయుక్తరాష్ట్రాలు, బ్రిటిషు సామ్రాజ్యంలాంటి గొప్ప శౌర్యాంగాలనే ఒక్కుమ్మడిగా గునుమాడజూచే జపాన్‌వంటి వైరిని చైనా ప్రతిఘటించి విజయాలు చూరగొంటూందంటే ఆశ్చర్యంగా వుంది. "ఫలం కోసం తాపత్రయపడకుండా పాటుబడి వస్తోత్పత్తిచేయడం; అధికారం చెలాయించకుండా సర్వమానవసౌభ్రాతృత్వంతో సంపాటుపడడం" అని "లో-టెజ్" బోధించిన ధర్మసూత్రాన్నే చైనా-భారతదేశ ప్రజలు అనుసరిస్తున్నారు. ఈ సూత్రమే ప్రపంచశాంతి ప్రదాత. "క్షమాపణ, సౌభ్రాతృత్వము" అనే రెండు గొప్ప గుణాలకు ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చే చైనా-భారతప్రజ, ప్రపంచ శాంతికోసం, భావి అభ్యున్నతికోసం సఖ్యతతో పాటుబడాలి.

# మా ఏజన్సీ షరతులు

1. అవసరమైనప్పుడల్లా మా ప్రచురణలను మొత్తంగా తెప్పిచుకొని అమ్మేవారే మా యేజంట్లు.

2. ప్రతి ఆర్డరుకు 25% కమీషను ఇవ్వగలం. రైలు పార్సెలుద్వారా మాత్రమే పుస్తకము లంపబడును గనుక రైల్వే రసీదును పంపను రిజిస్టరు ఖర్చులు పార్సెలు ఖర్చులు ఏజంట్లే భరించాలి.

3. కమీషను పోగా తడవకు కనీసం రూ. 10—0—0 విలువగల పుస్తకము లను తెప్పించుకోవాలి. అనగా రూ 13—0—0 ఖరీదుచేసే పుస్తకాలకు ఆర్డరివ్వాలి.

4. ప్రతి ఆర్డరులోను ఏ రకానికి ఎన్ని కాపీలు కావాలన్నా పంపగలము.

5. పైకం ముందుగా మనియార్డరుద్వారా పూర్తి మొత్తం పంపాలి. లేకున్న పుస్తకములు పంపలేము. పోస్టల్ ఆర్డర్సు పుచ్చుకోము. బ్యాంక్ చెక్కులు పంపేవారు వాటిని రొక్కంచేసుకోను అయ్యే కమీషను ఖర్చునుగూడా పంపాలి. చెక్కులన్నీ గ్రంథమండలి పేరగాక "ఏ. జి. రెడ్డి" పేర పంపాలి.

6. వి. పి. పి. లకు పుస్తకము లంపము. కాని ఏజంట్లు రూ 10—0—0 మావద్ద డిపాజిట్ కట్టియుంచిన వి. పి. పి. ల కంపగలము. ఈ డిపా జిట్ మొత్తం సంవత్సరం పూర్తిగానిది వాపసుచేయబడదు.

7. ఏజంట్లకు మా నూతన ప్రచురణలగురించి ముందుగ్గా తెలియజేస్తాం. ఇత రులు రిప్లై కార్డులు వ్రాసినగాని ప్రత్యుత్తర మివ్వలేము.

NKATARAMAN

| | | Rs. |
|---|---|---|
| 1. | JATADHARAN & OTI ES (A Collection of Short Stories ... ... | 1 |
| 2. | KANDAN, THE PATRIOT (A Novel of New India in the Making) Second Edition ... | 2 |
| 3. | RENASCENT INDIA (A Study of Indian Problems) Third Edition ... | 1 |
| 4. | A DAY WITH SAMBHU (Talks to a Boy) Sd. Edn. | 0 |
| 5. | THE NEXT RUNG (A Constructive Study of Modern Civilisation) Sd Edn. | 1 |
| 6. | MURUGAN, THE TILLER (A Novel of Indian Rural Life) Third Edition | 2 |
| 7. | ON THE SAND-DUNES (Musings of Life in free Verse) Second Edition | 1 |
| 8. | PAPER BOATS (Sketches of Indian Village Life) Fourth Edition | 1 |
| 9. | THE INDIAN VILLAGE (A Ten-Year Plan) Second Edition ... | 0 |
| 10. | HIGH WAYS OF ASTROLOGY By Kumbha Sd. Edn | 1 |
| 11. | VENKATARAMANI Writer and Thinker By Manjeri S Iswaran ... | 0 |

**IN TAMIL :**

| | | |
|---|---|---|
| 1. | KANDAN, THE PATRIOT (By the Author himself) | 1 |
| 2. | MURUGAN, THE TILLER (By Krishna Kumari) ... | 1 |

**IN TELUGU :**

| | | |
|---|---|---|
| 1. | MURUGAN, THE TILLER By P. Ramabrahmam ... | 1 |
| 2. | KANDAN, THE PATRIOT ... | 1 4 |
| 3. | A DAY WITH SAMBHU ... | 0 |

**IN SANSKRIT :**

A DAY WITH SAMBHU By Y. Mahalinga Sastri ... 0 4

A DAY WITH SAMBHU By Sivaram ... 0 3

**SVETARANYA ASHRAMA : Mylapore, MADRAS**

Printed by ... Press, 43, Acharappan Street. G. T Madras